శ్రీరస్తు.

# ప్రచండరాఘవము.

ఇది

అయిదంకముల నాటకము

గూటాల నివాసియగు రాచర్ల వేంకటకృష్ణారావుచే

రచియింపఁబడి

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము.

అయ్యగారి బాపిరాజుగారిచే

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1911.

 వెల 0-8-0

# పీఠిక.



చదువరులారా! నాకుఁజిన్నతనమునుండియు రామకథను రూపకంబుగ వ్రాయవలెనను కుతూహలమున్నది. దానికిఁదోడు మా మామగారగు బ్రహ్మశ్రీ జాజాల సాంబయ్యగారియొక్కయు నామిత్రుఁడును వైశ్యకులావతంసుఁడును నగు నూకా వెంకటరంగారావుయొక్కయు ప్రోత్సాహమువలన నేనీచిన్ననాటకమును 1911 సం॥ రం అక్టోబరునెల 1 తేదిని ప్రారంభించి ఆనెలలోనే 25 తేది నాఁటికి ముగించితిని. విశేషపండితుఁడనుగాకపోయినను శాస్త్రగంధమిసుమంతయు నుండకుండినను యెట్టులో తగుదునని సిద్ధపడివ్రాసితిని. ఈకథారత్నముపయిననుండు నభిమానముచేతనయినను గుణగ్రహణ పారీణులగు సత్కవులు దీనిని మన్నింతురని నమ్ముచున్నాను. ప్రమాదములను ముద్రాదోషములను మన్నించు భారము విద్వత్కవుల భుజస్తంభమునఁ బెట్టితిని. నాసాధ్యమయినంతవఱకు సరిచూపించితిని. ఇంకను నుండిన దెలియపఱచినయెడల ముందుకూర్పునకు సరిచూతును.

గూటాల.
2—11—1911.

ఇట్లు విన్నవించు మీవిధేయుఁడు.
రాచర్ల వేంకటకృష్ణారావు.

## ఈనాటకమున వచ్చుపాత్రలు.

---

### పురుషులు.

1 రాముఁడు—కథానాయకుఁడు
2 లక్ష్మణుఁడు—రాముని తమ్ముఁడు.
3 సుగ్రీవుఁడు—వానరరాజు.
4 హనుమంతుఁడు—సుగ్రీవుని మంత్రి.
5 అంగదుఁడు—వాలికొడుకు.
6 రావణుఁడు—లంకానాథుఁడు.
7 ఇంద్రజిత్తు—రావణునికొడుకు.
8 విభీషణుఁడు—రావణునితమ్ముడు
9 అతికాయుఁడు—రావణుని మంత్రి.
10 కుంభకర్ణుఁడు—రావణుని తమ్ముఁడు.
11 కుంభుఁడు } రావణునిబంటులు.
12 నికుంభుఁడు }
13 జటాయువు—పక్షికులేంద్రుఁడు.
14 ఇంద్రాగ్ని యమవరుణులు—దిక్పతులు.

### స్త్రీలు.

1 జానకి—కథానాయిక.
2 ఏకజట } విభీషణుని కుమార్తెలు. సీతకుకాపున్నవారు.
3 త్రిజట }
4 మండోదరి—రావణుని భార్య.

***N. B.*** ఇంకను కథాసందర్భమున స్త్రీ పురుషులు వత్తురు.

శ్రీ ర స్తు.

# ప్ర చం డ రా ఘ వ ము.

## ప్ర థ మాం క ము.

—[నాంది]—

ఉ. ఏయది భుక్తిముక్తులకు * నిద్ధరదానకమై చెలంగునో
యేయది సర్వపాపవని * నెంచఁగ దగ్ధముఁజేయ నగ్నియో
యేయది మోక్షసౌఖ్యముల * నీయఁగమంత్రమొ చూడ నట్టిరా
మాయణమెల్లవేళల న * మందగతిన్ మిము గాచి ప్రోచుతన్.

మఱియును,

మ. జగమం దుండెడిసర్వభూతతతికిన్ * సంరక్షకుం డెవ్వఁడో
వగలన్ బొందెడి నార్తులన్ గరుణచే * బాలింప దక్షుం డెవం
డగదంకారకులెల్ల నెవ్వనికిలో * నైయుందురో ధాత్రి, నా
భగవంతుండగు నాదిదేవుఁడిమతిన్ * భాగ్యంబుమీ కొప్పఁగున్.

[నాంద్యనంతరమున సూత్రధారుఁడు ప్రవేశించి]

సూ—అతివిస్తర మేటికి! మత్సహచరుఁడగు పారిపార్శ్వకుని బిలిచెదఁగాక. (అని తెరవైపుజూచి) పారిపార్శ్వకా! తీరికగానుంటివేని యొకమారిటురా.

పారి—(ప్రవేశించి) అయ్యా! నన్నుఁబిలిచినఁగారణ మెఱింగింపఁగోరుచున్నాఁడ

సూ—ఓయి? యిదెచూడు.

సీ. వేదశాస్త్రంబుల * వేమారుఁజదివిన
శాస్త్రజ్ఞులిదెవీరు * సఖుఁడ! గంటె
నర్తన శాస్త్రాభి * నయముల నేర్చిన
సుగుణ ఖనులువీరిఁ * జూచియుంటె
కర్ణములకు నింపుఁ * గలిగించు పలుకుల
బలికెడి రసికులఁ * బరగఁగంటె

సంగీత శాస్త్రంబు * చక్కఁగానేర్చిన
విద్వాంసులగు వీర * విభుతఁ గంటె
గీ. ధరణిలోపలనున్న వి * ద్యలనునెల్లఁ
జదివియున్నట్టి సరసుల * సౌరుఁగంటె
వర సుధర్మనుఁ బోలుచు * వరలుచున్న
సభనుగంటివె మిత్రుఁడా * సరగనిటను.

ఈమహాజనులీనాఁడు నన్నుఁ బిలిచి "సూత్రధారా ! ఏదియయిన నొక నవీననాటకం బాడి మమ్ముల నానందింపఁ జేయవలసిన" దని కోరిరి. అందుచే నిన్నిప్పుడు పిలిచితిని. నీ విక్కార్యమున నాకు తోడుపడవలెను.

పారి—అయ్యా! యిట్టి మహాజనుల నానందింపఁజేయఁగల్గు నవీననాటక మెయ్యది యో నాకు సెలవిండు.

సూ—ఓయి! వినలేదా? "ప్రచండరాఘవ" మను నూతన రూపకంబును?

పారి—లేదు. దాని నెవ్వరు రచియించిరి?

సూ—ఇదిగో వినుము.

సీ. రాచర్ల వంశాబ్ధి * రాకాసుధాంశుండు
నరసమాంబాగర్భ * వరఫలంబు
వితతసద్గుణుఁడైన * వేంకటరత్నాఖ్యు
నకుఁ గూర్చు పు * త్రుండు నయవిదుండు
సద్యశస్సోముఁడౌ * సాంబయాఖ్యునిగూర్మి
మనుమండునౌచు దా * మనుచునుండుఁ
జానకీసుతుల వి * జయమును రూపకం
బుగవ్రాసి యున్నట్టి * పుణ్యపురుషుఁ
గీ. డైన వేంకటకృష్ణ రా * యాఖ్యుఁడిద్ది
రూపకంబుగ రచియించె * పాపభంజ
నంబటంచు.మతి మహదా * నందముననుఁ
సరస మృదుమధురంబగు * శైలితోడ.

పారి—అటులయిన నేనిప్పుడు చేయవలసిన పనియేమి?

సూ—ఓయి! నీవుపోయి పాత్రములను సిద్ధపరుపుము. నేనును గవి విజ్ఞాపనము నీసభాస్తారులతోఁ జెప్పి వచ్చెదను. (అని సభవంకఁదిరిగి) పూజ్యులయిన యోసభాస్తారులార!

తే. గీ. తప్పులొదవిన దయను ది * ద్దంగవలయు
తప్పులేనిదె తప్పని * చెప్పరాదు
ఒప్పులుండిన వాని వ * ట్లుంప మిమ్ము
వేఁడుచుంటిని సద్గుణ * విబుధులార.

పారి—బావా!

తే. గీ. కాలయాపన మయిపోయెఁ * గానమనము
ముందుసంగతిఁ జూడంగఁ * బోవవలయు
రామచంద్రుఁడు జానకీ * రక్షణమునఁ
బోవకుండఁగ దుఃఖించు * పోల్కనిచట.

పోవుదమురమ్ము. (అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

శ్రీరస్తు.

# ప్రచండ రాఘవము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము—దండకారణ్యము.

[ప్రవేశము—రామలక్ష్మణులు.]

రాము—తమ్ముఁడా!

మ॥ అకటా! తన్విని నొంటిగావిపుల ఘో * రారణ్య మధ్యంబులో
వృకశార్దూలమృగాళికిన్ విడిచి యి * ట్లేతెంతురే మూర్ఖులై
వికచాబ్జేక్షణ యెంతదుఃఖపడెనో * వీడంగనీ వారయూ
రక, మారీచుఁడు "లక్ష్మణా" యనఁగమూ * ర్ఖత్వంబుచేవత్తువే?

ఎంత తెలివిమాలిన పనిఁజేసితివి!

లక్ష్మ—అన్నయ్యా!

ఉ॥ పోననియెంతచెప్పినను * బుప్పలబోఁడి మతిందలంపకే
మానసమందుఁగోపమును * మాటికిఁజూపుచు కఠినభాషలన్
దానుగ నన్నుదిట్ట, నవి * దారుణరీతిని నాటివోవఁగా
నే నిట వచ్చినాఁడ రజ * నీచరశిక్షక దీనరక్షకా॥

ఇంతియేగాక నన్ను ద్రోహియని గూడ దిట్టినది. అందుచే నేనా మెవిలాపమును జూడలేకయు పరుషవాక్యములఁ భరింపలేకయు, వచ్చితిని. మఱియు.

చ॥ ఎఱుఁగుదు "లక్ష్మణా"యనుచు * నిష్ఠురబిల్చినవాఁడు యామినీ
చరుఁడని, నీశిలీముఖ వి * షంబునఁజచ్చుచు నార్చెనంచు నే
నెఱుఁగుదునెల్లవానిఁ జల * జేక్షణ కెంతగఁ జెప్పియున్ననా
సరసిజనేత్రినమ్మక వి * షాదముతో ననుఁబంపవచ్చితిన్॥

గాన మనముపోయి యామెకంటఁబడకున్న మిక్కిలి దుఃఖించును. పోవు దమురమ్ము.

రాము—మంచిది. (అని కొంతదూరము నడిచి యెడమకన్నదరుటఁ గాంచితనలో) కారణ మేమయియుండును?

తే॥ గీ॥ ఏలొకో! యదరుచునుండె * నెడమకన్ను
ఎట్టి కష్టంబు గలుగునో! * యెఱుఁగరాదు
పర్ణశాలను నుండెడి * పడఁతి కేమి
గలిగియుండెనో తెలియంగ * వలనుపడదు.

అయినను బోవుచుంటిమిగాన తినబోవుచు రుచి దిగబోవుచు లోతునడుగ నేల? (అని పర్ణశాలను సమీపించి పరికాశముగా)

తే॥ గీ॥ నళినసంతతి లేనట్టి * కొలఁకువోలె
చంద్రసూర్యులు లేనట్టి * జగము భాతి
పతిని గోల్పోయియుండిన * పడఁతిరీతి
వరలు, జనశూన్యమౌచు నీ * పర్ణశాల.

తమ్ముఁడా! ఏలొకో పర్ణశాల జనశూన్యమయి యున్నది. జనకతనూభవ గాన దు యెటకేగెనదోగదా!

లక్ష్మ—అన్నయ్యా!

మ॥ జలముం దెచ్చుటకేగెనో మఱియుఁదా * జాతీలతాంతావళిఁ
లలిఁ గోయన్ జనెనో ఫలంబులను లీ * లారీతి తేఁబోయెనో
కలకంఠంబులఁబల్కు నేర్పఁగను నా * కంజాక్షి చెల్లాడునో
యిల; రాజోత్తమ! చింతనొందకిపుడే * యేతెంచెడిఁ జూడుమీ.

ఈపాటికామె వచ్చుచునేయుండవచ్చును.

రాము—తమ్ముఁడా! నామనంబున కెందుచేతనోగాని విషాదము గలుగుచున్నది.

తే॥ గీ॥ ఎప్పుడును వచ్చునరికినా * యింతిమిన్న
నాకు నెదురౌచునుండునీ * నాఁడదేమొ
ఎదురుగారాదు చోద్యంబ * యెటకుఁ జనెనో
మానసంబునఁ దెలియఁగాఁ * గానరాదు.

అయినఁ బిలిచి చూచెదఁగాక.

మ॥ చెలియా! రమ్మెట కేగితీవు వనిలో * సీతాసతీ! యొంటిగా
లలనా నిన్నెడబాసి యుండగలనా * లావైన దుఃఖంబుచే
నిలలో వంతలఁ జెందుచుండఁ గలనా * యింతీ యిటేనుండగాఁ
జలమేలా? సుగుణాలవాల! జనక * క్ష్మాపాలబాలామణీ?

ఓహో! ఏమిది, ఎంతపిలిచినను పలుకకున్నదే. (దుఃఖముతో) హా సీత! ఎటకేగితివి? ఏమియొనర్చుచుంటివి? నన్నీనడుకాన నొంటరిగాడించిపోవు తలంపు నీ కేలబుట్టినది? అగ్నిసాక్షిగ నన్ను వివాహమాడి దీనుండనగు నన్నొంటరిఁజేసిపోతివా? నీసాహసంబున కేమందును? ఎందుజొత్తును? నీ సుందరముఖారవిందము, కుందరదనా! జూడకున్నచో నే బ్రతుకఁగలనా? దివసపంచకముక్రింద నీవును నేనును శయ్యాతలముననుండు సమయమున "నాథా! నిన్నుఁబాసి యరనిముసమయిన నుండగలనా" యంటివి. అప్పుడే యామాటల మఱచితివా? నీ వేలమఱతువు. ఎఱుఁగక నే నేదో నీకొక మహాపదఁ గావించియుంటిని. ఆ! యెఱుఁగక యనుటేల? ఎఱిఁగియే యొనర్చితిని. యేదియైన సుఖముగా నింటికడ నుండనీయక భీకరకాననాంతరమునకు తీసికొని వచ్చిన పాపికెట్లుజరుగవలసినదే. అట్లననేల? నేను మొట్టమొదట నాతో రావద్దని వారింపలేదా? అట్లు వారించినను నీవాగక నాతో వచ్చి తుట్టతుదకిట్లు మోసపుచ్చుట నీకు భావ్యమేకదా. ఆ! ఏమి? నావెఱ్ఱి సద్గుణోపేతయగు సీత నన్ను బాసిపోసాహసించునా? ఈసమీపమున నే దాఁగియుండవచ్చును. ఈవృక్షజంతుల నరసెదఁగాక. (అని వానిని గాంచి)

సీ॥ హరిమధ్యఁ గాంచరే * హరులార! కరులార!
తరులార! శైలకం * దరములార!
జలజాక్షిఁ గాంచరే * జలజాతముల తేనెఁ
దీసి త్రావుచునుండు * తేఁటులార!
పికవాణిఁ గాంచరే * పికకూటములపాట
వినఁగోరిఁ జనుదెంచు * విహఁగులార!
కనకాంగిఁ గాంచరే * కనకాచలముఁబోలి
భాసిల్లు పర్వత * పంక్తులార!

గీ॥ కులుకులాడిని గాంచరే * కోలముులార !
మందయానను గాంచరే * మానులార !
సుగుణధామను గాంచరే * శుకములార !
యవనిజాతను గాంచరే యక్షులార!

(అనిదుఃఖించును)

లక్ష్మ—అన్నయ్యా ! ఏల యీలీల జేలనై జాలిఁదూలెదరు? విచారించిన కార్యములేదు. ఎవ్వఁడో రాక్షసుఁడు మనల వంచించు తలఁపున నామెనెత్తుకొనిపోయి యుండవచ్చును. కాన వానికయి వెదకి సీతను దెచ్చుకొనుట మంచిదిగాని యూరక చింతించిన నేమిప్రయోజనము. (తనలో) అకటా జానకీ ! ఎంతపని చేసితివి.

ఉ॥ రాముని కంఠరావమది * రామ రో ! కాదు నిశాచరుండు సం
గ్రామములోన బాణమున * బ్రాణమువీడుచు నిట్లుపేర్లెనా
వేమరుజెప్ప మాటలను * వెఱ్ఱితనంబునఁ ద్రోసిపుచ్చి యో
కామిని నన్నుబంపి తిరు * గఁగ గనుపింప విదేమికర్మమో.

అయ్యో సీతా! నిన్ను దలంచుచు నీనాథుఁడెట్లు విలపించుచున్నాఁడో వచ్చిచూడుము. ఏమి పలుకకున్నావు ఏల మాటలాడవు? మాపయి నీకింత కోపమేల? అహో ఏమి నావెఱ్ఱి! జాయావియోగసంజనితదుఃఖావేశపరంపరాకలుషితుం డయిన రామచంద్రుని నోదార్చుటకు మారు నేనుఁగూడ దుఃఖించుచుంటిని. మేమిరువురము నిట్లె యున్నచో నిఁక మమ్ముల నోదార్చువారెవ్వరు? గాన నేను ధైర్యమవలంబించి వీనిదైన్యంబువాప యత్నించెద. (ప్రకాశముగా)

ఉ॥ చింతిలనేలనో నృపతి * శేఖర సర్వల సద్గుణాకరా
పంతముతోడ పూర్వభవ * పాపవిధుల్ జనుదెంచి దుఃఖిత
స్వాంతులఁ జేయునంతటనె * బంధురశోకముఁ జెందఁజెల్లునే
ఎంతటివారికైన మహి * నియ్యవి తప్పవుగాఁ దలంపఁగన్.

కాన శోకంబుమాని భూమిజ పోయినదారిం బట్టి పోయిన కొంతకాలంబునకామె జాడ నాభగవంతుఁడనుగ్రహింపకుండునా? గాన పోదముగండు.

రాము—మంచిది. (అని నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము—అరణ్యము.

---

[ప్రవేశము.]—రామలక్ష్మణ జటాయువులు.

రాము—విహంగకులేంద్రా! ఏమంటివి.

తే॥ గీ॥ లంక కధిపతిరాక్షస * లక్ష్మివిభుఁడు
మోహవశమున జనక సు*పుత్రిఁగాంచి
మదనపరితాపజలధి ని * మగ్నుఁడగుచు
నెత్తుకొనిపోయె మూఢుఁడై * యింతిఁబురికి॥

అంతియేకాదు?

జటా—అవును, ఆతఁడు తన రథముపయి నాసాధ్వి నెక్కించుకొని గొనిపోవుచుండ, మీతండ్రికిని నాకునుఁగల చిరస్నేహానుబంధముచే నేనడ్డుపడ నాతఁడు,

శా॥ చండాంశుప్రతిమానతేజుఁడగుచున్ * సక్రోధుఁడై తాను, కో
దండజ్యారవమెల్ల దిక్కుల ప్రతి* ధ్వానంబులం జేయఁగా
దండాకార, శిలీముఖంబులను మ * ద్గాత్రంబు చూర్ణంబుగా
ఖండంబుల్ పడఁజేసి పుచ్చె గను భూ * కాంతాన్వయగ్రామణీ॥

(అని తన దేహమును జూపును.)

రాము—విహంగకులాగ్రశేఖరా! పాపము నీకెంతటిపాటువాటిల్లె! నుపకారముఁ జేయబోవ నపకారమెదురయినది. నీవు పుత్రవాత్సల్యముచే మమ్ముద్ధరింప నడుకట్టిన నీ మేలు నేనాజన్మాంతము మఱువను.

జటా—అట్లయిన నోరామచంద్రా!

ఉ॥ కాయముగాయమయ్యె గడి * కండలనుండి స్రవించు రక్తముల్
తోయముభంగి ప్రాణములు * తో నిలువందదసంతరంబునన్
బాయక దగ్ధగాత్రునిఁగ * బాపనుఁజేయఁగఁ గోరుచుంటి నా
మ్నాయమయుండవంచునిను * మానులు బల్కుదురయ్య పావనా.

నీవు మాయామానుష విగ్రహుండవగు హరివనియు భూభారముఁదొలఁగింప జన్మించితివనియు మహాత్ములుఁ గొందఱు నాకుఁ జెప్పఁగంటిని. గావున నీవు నాకళేబరమును దగ్ధ

మొనర్చినచో సకలానందసంధానమగు నాకరాజ్యభోగంబు లనర్గళలీలననుభవింతును. మీకీ రావణుని సంగతి నెఱింగించు దనుక నెట్టెటో ప్రాణంబుల నిల్పితిని. ఇక నిలుఁపఁజాల.

రాము—నీకవశ్యము విష్ణులోకావాప్తి యగుఁగాక!

[అంతట జటాయువు ప్రాణములు విడుచును.]

తమ్ముఁడా! మనమీ పక్షికులావతంసునకగ్ని సంస్కారము గావించి వత్తమురమ్ము.

లక్ష్మ—అన్నయ్యా! మంచిది.[అని నిష్క్రమించి తిరుగఁ బ్రవేశించి సీతనుద్దేశించి]

రాము—హా జానకీ! ఎంతటి కష్టములపాలయితివే?

మ॥ వనజాక్షీ! దశకంఠుఁడాగునపుడ * ప్పాపాత్మునాకారముఙ్గ
గని భీతిల్లితివో, మనంబుగలఁగన్ * కారుణ్య రత్నాకరా!
ననుగావంజను దెమ్మటంచడలితో * న్యాయంబె నీకన్యకాం
తను మోహింపఁగనంచు వానికనుదో * తన్వీ! మఱేమాడితో.

మఱియు,

ఉ॥ లంకను నెట్టిగష్టముల * లావున రాక్షసనాథుఁడక్కఁ చే
బంకజనేత్రి! నీకిడునొ * పాపునిగూడక యూరకుంటివన్
శంకను నాకునై యెటుల * సారసనేత్రి! విషాదమొందెదో
గొంకును జంకులేక నిను * గోలను గోలలపాలుజేసెనో.

హా సీత! ఎట్టి కష్టములనుభవించుచుంటివో కదా. చతురంభోధి పరీతమహీచక్రింబవక్రవిక్రమక్రమంబున నేలుజనక భూజానికి ముద్దులకూఁతురవయి సకలారాతిమహాగహనవీతిహోత్రుండగు దశరథ భూకాంతుని కోడలఁవయి విశేషించి నాకు భార్యవయిన నీవు నేఁడు దిక్కుమాలిన దాని చందమున మూర్తీభవించిన పాపదేవతయగు రావణనక్తంచరాధముని పురంబునందిడుముల గుడువవలసివచ్చెనా? దైవమా! హతవిధీ! నీకు మేమేమపరాధ మొనర్చితిమి. మాపయి నీకింత యలుక యేల?

లక్ష్మ—అన్నయ్యా! ఆపత్సమయంబున ధైర్యము ధీరోదాత్తలక్షణమని పెద్దలు చెప్పుదురు.

మఱియు.

చ॥ నరుఁడు సుధీరుఁడై యెడ, ఘ * నంబగు నాపదవచ్చియున్నఁ ద
న్నిరతముగొల్చు బంధుగులు * నీరసులై నను, పాణిమూడిపో

తఱిఁగనన్నైన శోకములఁ * దద్దయు జెందను నజ్ఞుఁడన్న నో
భరమగు నావ్యథైనఁ దని * బంధురశోకపుఁ వార్ధిమగ్నుఁడా.

సర్వముం దెలిసిన మీకుఁ జెప్పుటకు నేను చాలకపోయినను నామాట పాటింపఁ గోరెద.

రాము—లక్ష్మణా! నీవు చెప్పినమాట నిక్కమే గాని యెంత యాపుకొందమన్నను నాగక పొంగిపొంగి పారలివచ్చు నీశోకప్రవాహముఁ గట్ట నాతరమగునా?

లక్ష్మ—అన్నయ్యా! యెటులనో ప్రయత్నించి గట్టవలెను. గాని యూరక వాపోవుటవల్ల నేమి లాభము. దుఃఖించి మీరు సీతను తేగలరా?

రాము—దుఃఖించి తేగలననుమాట కలలోనివార్త. ఇఁక నూరక మనసుండక వాపోవుటయే నాకు దారిగ కనుపించుచున్నది. అయిన నీవు నన్నేమి జేయుమనెదవు?

లక్ష్మ—చేయుటకు మీకు మార్గమే లేదా! యిదిగో వినుఁడు.

చ॥ ఘనతరమూర్ఖభావమున * కామశరానలతప్తుఁడై దశా
ననుఁడు, రయంబునన్ బురికి * నాతిని సీతను గొంచుబోయెఁగా
యని మొనలోనవాని, వడి * నంత మొనర్చి ధరిత్రికూతు, వే
గనుగొని తేవలెంగద వి * కాసముగల్గఁగ దేవకోటికిన్.

యింతకన్న ముఖ్యాచరణం బెద్దియును లేదు.

రాము—అనుజా! లక్ష్మణా! శోకాంధకారమునఁబడి దారిఁగానని నాకు నీవచో దీపికలచే దారి గన్పించినది. [క్రోధముతో]

మ. ఖలుఁడై రావణపాంసనుండు ధరణీ * గర్భోద్భవన్ లంకలోఁ
బలుగష్టంబులఁ బెట్టుచుండ గనినేఁ * బాపాత్ముసైరింతునే?
కలనన్ శౌర్యముఁ జూపి కాలుపురికిన్ * ఖండించి పంపింపనే?
లలనన్ గావనె శౌర్యహీనుఁడనె లీ * లాక్రీడఁ జూపింపనే.

మఱియు,

ఉ. వారిధిఁ జొచ్చినన్ హరుఁడ * వారణరీతిని సహ్యవచ్చినన్
వారి జగర్భపజ్జను స * భక్తి నిడాగిన యుద్ధమందు దా
శూరుడఁగాను గావుమని * సోలి నమస్కృతిఁ జేసినన్ వడిన్
మారణ జేతు రావణుని * మాన్యనురాకుసమూహ నొక్కటన్.

మనము యుద్ధప్రయత్నముఁజేయ నరుగుదమురమ్ము. [అనినిష్క్రమింతురు.]

## తృతీయరంగము.

---

### ఋష్యమూకపర్వతము.

[ప్రవేశము.]—సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడును.

సుగ్రీ—[శోకముతో] మంత్రివరా! మారుతీ!

తే॥ గీ॥ ఎన్నిదినములు నేనిట్టు * లీనగమునఁ
గాపురంబును జేయుదు * నాపురంబుఁ
బాసియుండియుఁగడుదీన * భావమునను
వాలి దాడికిఁ గలఁగుచు * సోలుచుండి.

మఱియు,

తే॥ గీ॥ ఎవ్వరికినైనఁ జావుండు * నీధరిత్రి
వాలికిని మాత్రమది లేదు * వాయుపుత్ర
చిన్నతనముననుండియుఁ * జెక్కుచెదరు
లేక యున్నాఁడుశిలవోలె * నేకరీతి.

ఆతనిని దలఁచినంతటనే నాయొడలు కంపమొందుచున్నది.

హను—సూర్యపుత్రా! ఏటికింత భయమొందెదవు. ఆతఁడు నీవిక్కడనుండునంతవఱకును నిన్నేమియుఁ జేయఁజాలఁడు గదా. ఇప్పుడింతచింతయేల?

సుగ్రీ—ఈయుపకార మాఋషిసత్తమునివల్ల చేకూఱినది. ఇక వానిని గడతేర్చుట గూడ నేఋషివల్లనయినఁజరిగిన బాగుగనుండును.

జాంబ—అదియు నచిరకాలములోనే సంభవించును.

సుగ్రీ—దానికొఱకే నేనును నిరీక్షించుచుంటిని. [తనలో] అక్కటా యెట్టికష్టములఁ బెట్టుచుంటివిరా! సోదరా!

ఆ॥ వె॥ పురముమండి నన్ను * మూర్ఖతఁదోలియుఁ
జాలసార్లు భీమ * సంగరమున

నొడిచిపుచ్చి తుదకు * నోర్వంగరాని యీ
నగముపయినఁ బ్రితుకఁ * బగదలఁచితే.

(అనిచింతించును.)

[ప్రవేశము.]—రామలక్ష్మణులు మునులరీతిని ఖడ్గపాణులయి.]

రాము—తమ్ముఁడా! వీరెవ్వరో కపికులావతంసులట సభఁదీర్చియున్నారు. ఇది యట్లుండ మనలఁజూచినంతటనే కొండలు పాటిపోవుచుండెరేమి జెపుమా.

[అని యోచింతురు.]

సుగ్రీ—మారుతీ! ఆవచ్చు కపటయోగులనుఁ జూచితివా?

తే॥ గీ॥ పౌరుషముదోప నాయుధ * పాణులగుచు
నారచీరలు ధరించి * నారు కపట
మానులట్టుల చరియింతురు * కానలోనఁ
గారణంబదియేమొకో * గానరాదు.

మఱియు.

క॥ వీరింజూచినతోడనె
క్రూరుండవ్వాలి గడుఁబ్రి * కోపితుఁడయి, తా
నారయ మనపై కంపిన
శూరులకై వడిని దోచుఁ * జూడుముహనుమా!

కాన నీవేగి వీరియుదంతంబె మోయరసిరమ్ము.

హను—చిత్తము. [అని పరిక్రమించి]

ఓ కపటమానులార!

ఉ. ఎవ్వరుమీరుఖడ్గముల * నింపుగఁదాల్చియు మానులట్లుగా
నివ్విధినారచీర లవి * యేటికిదాల్చితిరయ్య ధీరులై
యివ్వనభూములందిరుగ * నేర్పడఁదెల్పుఁడు మాప్రభుండు తాఁ
దవ్వులఁగాంచిమీదగు, యు * ద్ధాస్థితిఁ గన్గొనఁ బంపవచ్చితిన్.

లక్ష్మ—ఓయికపివులానేర్పినరా!

ఉ॥ ఈతఁడు రామచంద్రుఁడు సు * మీ! ధరణీతలనాథుఁడైన యా
యాతతశౌర్యుఁడౌ దశర * థాఖ్యనృపుత్రుఁడు నాకునన్న, తా
సీతయనంగఁ బొల్చు సర * సీరుహలోచనఁ గూడివచ్చి వి
ఖ్యాతవనంబునందు సతిఁ * గానక వందురు నోకపీశ్వరా.

నాఁటనుండియు మేమామెను గానలేక తిరుగుచుండ నీ నడుమ మాతండ్రిగారి హితుండగు జటాయువను విహంగకుల పుంగవుండొకఁడు ప్రాణావశిష్టుఁడయియుండి మమ్ముఁ బిలిచి లంకానాథుఁడగు రావణుండామెనెత్తుకొనిపోవుచుండ తానడ్డుపడ నాతఁడు తన్ను గెలిచి తీసికొనిపోయెనని నుడివెను. గాన మేమామూర్ఖు నేవిధినైన సంహరించి సీతను తేవలెనని తిరుగుచుంటిమి.

హను—అట్లయిన నో రామచంద్రా! యీసమీపమున.

శా॥ ఉగ్రత్వంబున నగ్రజుండు కినుకన్ * యుద్ధంబులో గెల్వఁగా
సుగ్రీవుండను మర్కటాధిపుఁ డిదే * శోకించి భీతాత్ముఁడై
స్వగ్రామంబున నుండి వాని గెలువన్ * శక్తుండుగాజాలమిన్
దాగ్రావాగ్రమునన్ వసించు జన నా*థా! సఖ్యముం జేయుమా.

అట్లొనర్చినచో సమానాపదలోనున్న నాతఁడు మీకుఁ దోడ్పడును. దాన మీకు సకలాభ్యుదయంబులును జేకుఱును. గాన మన మయ్యెడకుఁ బోవుదము రండు.

రాము—మంచిది. (అని సుగ్రీవుని సమీపించి) కపికుంజరునకు మంగళమగుఁగాక.

సుగ్రీ—ఉగ్రాంశుకులోద్భవులకు విజయము. స్వామీ మీరత్తాశాఖలపయి నధిష్ఠింపుఁడు.

(అట్లు సాలమహీరుహశాఖలపయి రామలక్ష్మణులు గూర్చుందురు.)

రాము—ప్లవగవీరా!

మ॥ పురముం బాసియు రాజ్యమున్ విడిచి యే * భోగంబులున్ లేక భీ
కర కాంతారమునందు మిత్రతతితో * గష్టంబులన్ జెంది దు
ర్భరమై నిష్ఠురకంటకాన్వితమునై * బాధాకరంబైన యీ
గిరిపై వాసముఁజేయు కారణము సు * గ్రీవా! వడిన్ దెల్పుమా.

సుగ్రీ—మహాత్మా! నావృత్తాంతము నేమని తెల్పుదును. బలపరాక్రమసంపదు

స్వాదసంజనిత గర్వావిలచేతస్కుఁడంచితత్రిశూలియగు వాలి నాయన్న బలహీనుఁడన గుననున్నుజయించి నాపురము నాక్రమించెను. నేను ననేకసారులు వానిని జయింపనేగితిని గానితుదకు విఫలమనోరథుఁడనయితిని. ఎందుచేతనన,

తే॥ గీ॥ వానికెదురుగానిల్చి యె * వ్వాఁడుగాని
యుద్ధమునుజేయఁ దేజ స్స * మృద్ధియెల్ల
వాలికేజేర నగుఁ గాన * శూలియైన
లేశమైనను గెల్వంగ * లేఁడునుమ్మీ.

నాటంగోలెనేనీ ఋష్యమూకాద్రినినాకపిసేనతో విహరించుచుంటిని అతఁడియ్యె డకు వచ్చినఁ జచ్చునట్లొక మౌని శాపమిడెను. అందుచే నిక్కడకు రావెఱచును. ఇఁక ముందెట్లో (అని చింతించును.)

రాము—సుగ్రీవా !

తే॥ గీ॥ ఎటులనైనను నీయన్న * నేను, కాలు
పురికిఁబంపెద నీవేమి * తిరుగనాకు
జేయఁగలుగుదో వేగమే * జెప్పుమయ్య
లలిత గుణసాంద్ర ! సుగ్రీవ * ప్లవగచంద్ర.

సుగ్రీ—అట్లయిన నోరామా !

తే॥ గీ॥ పంచ భూతంబులును నీవ * పంచహేతు
భూతులౌ సూర్యచంద్రుల * మ్మోఘమూర్తు
లును, గనంగ సంగ్రామము * లోన మీకు
రావణునిఁ జంపఁ దోడ్పాడు * రామచంద్ర.

ఇమ్మాటకడ్డులేదు. నిజముగా మీకు నాకపిసేనతోఁగలసి తోడువత్తును. ముందు మీసీతను వెదుకఁ బంపెదను. యిది యటుండ మీబలపరాక్రమంబులు నాకుఁదెలియవు గాన మీరలొక్కనారసంబున నాసప్తసాలంబులను నేలఁ గూలనేసిచో మీరు వాలిని జంపఁగల్గుదురను నమ్మకము జిక్కును గాన నట్లొనర్పుఁడు.

(అని చెట్లఁజూపును.)

రాము—మంచిది యిదె చూడుఁ. తమ్ముఁడా కోదండంబిటు తెమ్ము. (అని ధను వుఁబుచ్చుకొని బాణముసంధించి)

తే॥ గీ॥ తండ్రి యేవేళ సత్యంబు * దప్పఁడేని
మాతయు బతివ్రతాత్వంబు * మఱువ దేని
నేను దేవాంశజనితుండ * నేని యేఁపు
సాలములుఁ గూలు శరముచే * సత్యముగను.

(అని శరంబు విడుచును,) (నేపథ్యమున గుభిల్లుమనుధ్వని)

సుగ్రీ—(సంతోషముతో) రవికులశశీ ! నేఁటికిగదా ధన్యుఁడనయితిని. ఇఁక నాయాపదలు గట్టెక్కఁగలవు నేనిప్పుడె ధరణీపుత్రికను వెదకి మీయానవాలా మెకిచ్చి యా మెశిరోభూషణముఁ దెచ్చునంతటి సామర్థ్యముగల తరుచరేంద్రుల బంపెదను. మీరిఁక నిశ్చింతతో నుండుఁడు. (అని హనుమంతునిజూచి) గంధవహపుత్రా !

చ॥ వడిగపిసేనఁగూడి యల * వారధి దాటి దశాస్యులంకలో
బడి కృశియించి రామయని * పల్కుఁచు సంస్మరియించుజానకిన్
బడఁతినిగాంచి రామవిభు * వార్తయు సేమమురాకఁ దెల్పి వే
తడయక నామెభూషణము*దద్దయుదెమ్ము కపీంద్రచంద్రమా.

మఱియు

కం॥ నీనాథుఁడు సేనలతోఁ
జానా ! ఘనవార్ధిఁదాటి * సంగరమున తా
నీ, నక్తంచరుఁ జంపియు
మానకఁ గొనిపోవునిన్ను * మానితచరితా.

అని యనేకరీతుల నామెకు తెలియపరచి రమ్ము.

రాము—ఓయి ! నే నిట్లంటినినుమా,

సీ॥ నినుబాసి యుంటచే * ఘనశోక తప్తుఁడై
యుండె రాముఁడటంచు * నువిదకనుము
నీకౌగిలోనరించు * నీచదశాస్యుంపుఁ
జాలకాలము మనఁ * జాలఁడనుము
సౌమిత్రియు విచార * సాగరంబునఁజడి
పొరలుచుండెనటంచుఁబొలతికనుము

కలకాలమొకరీతిఁ * గడువఁజాలదుగానఁ
చింతింపఁదగదని * చెలియకనుము
గీ॥ వీకఁగపిసేనతోఁ దాడి * వెడలెననుము
వార్ధిఁ బంధించి లంకకు * వచ్చుననుము
ఖలులఁ బరిమార్చి వేగనిన్ * గాచుననుము
మనకు జయమాటకర్తలా * మలకమనుము.

హను—చిత్తము.

లక్ష్మ—ఆయ్యా! సౌమిత్రి యిట్లు నుడివెననుము.

ఉ॥ రాముని కంఠరావమది * రామరో! కాదు నిశాచరుండు సం
గ్రామములోన బాణమున * బ్రాణమువీడుచునిట్లు పేర్లెనా
వేమరుజెప్ప పల్కులను * వెఱ్ఱితనంబున ద్రోసిపుచ్చి యో
కామిని నన్నుఁబంపి కడ * గండ్లకు లోనయిపోతివమ్మరో.

నాఁడట్లు ఁబంపకపోయిన నిట్టివిపత్తులు సంభవింపకపోవునుగదా. తల్లీ! యెట్లయిన మేము నిన్ను కొలఁదికాలములోనే జెఱనుండి విడిపింతుము. రావణునిజంపెదము యిది ముమ్మాటికిని సత్యము.

హను—చిత్తమట్లెవిన్నవించెదను. నాకు సెలవా?

రాము—మంచిది. (అంతట హనుమంతుఁడు నిష్క్రమించును.) సుగ్రీవా! మనముగూడఁబోయి వాలిహతకసంహరణాభీల తరమనన్కులమయి, విజృంభించి తప్ప యత్న మొనర్తమురమ్ము. నీవుబోయి ముందు వానితో గయ్యమొనర్పుము. పిమ్మట నేను వానిఁ గడతేర్చెద.

సుగ్రీ—చిత్తము.

(అంతట అందఱును నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

---

# ప్రచండరాఘవము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగం

రావణుని సభ.

[ప్రవేశము— రావణుడు, ఇంద్రజిత్తు విభీషణుడు
అతికాయుడు మొదలగువారు.]

రావ—మంత్రీ! అతికాయా మొన్న మన పురంబునకు వచ్చిన కపియేమేమి పాడొనర్చెను ?

అతి—స్వామీ !

సీ॥ అనలంబుచేనిండ్ల * నంటించియంతట
సౌధంబులెల్ల భ * స్మంబుచేసి
తోటలన్నియుఁ ధూళి * ధూసరంబొనరించి
మనవీరులడ్డంగ * మంటఁ గలిపి
ఆహవోద్ధతుఁడైన * నలయక్షుఁ బరిమార్చి
కనపడ్డదనుజుల * గండడంచి
విక్రమించియునార్చి * వెస విజృంభించియు
భూపుత్రిసేమంబు * పూన్కినెఱిఁగి.

గీ॥ మజల వారిధి లంఘించి * మర్కటుండు
రాఘవేంద్రుని కడకేగెఁ * బ్రిబలభక్తి
వానిచేష్టలు చెప్పంగ * వశముగాదు
ప్రథితసద్గుణ సాంద్రియో * రావణేంద్ర.

రావ—(విషాదముతో) అక్కటా! యట్లొనర్చుటవలన మన పురమునకుఁజాలనష్టము సంభవించెఁ గదా.

తే. గీ. సుతుని బ్రహ్మాస్త్రమునలోఁగి * సోలినాఁడు
గానఁ దోకకు నిప్పంటఁ * గానె వీఁడు
చచ్చునని నేను మిక్కిలి * సంతసమునఁ
జేసియుంటిని గాకున్నఁ * జేయనన్న

విభీ—అన్నయ్యా! గడచిన దానికయి చింతించుట. గతజలసేతు బంధనముగదా. అందుచే నిప్పుడయిన వెఱ్ఱిమొఱ్ఱి యాలోచనలఁ జేయక సీతను రామచంద్రుని కప్పగించి సంధిఁ జేసికొనుము.

మఱియు.

తే. గీ. ఇతని కన్నను ఘనులైన * యితర కపులు
శౌర్యధైర్యాన్వితులు మహా * శక్తియుతులు
వేనవేలుగ నున్నారు * గాన మనకు
వలదు వలదన్న రాముతో * వైర మేల.

ఇప్పుడొక కపివీరునిచే మన రాజ్యంబంతయు నల్లకల్లోలమయినది గదా! ఇఁక వారందఱును వచ్చినఁ దప్పక ముప్పు సంభవించుఁగాన నామాటఁ బాటింపఁగోరెద.

రావ—(కినుకతో) మూఢుఁడా! ఆఁడుదానివలె నెట్టిపలుకులు పలుకుచుంటివి?

తే. గీ. అష్టదిక్పాలవర్యుల * నాహవమునఁ
గెల్చియుండియుఁ గైలాస * గిరినెత్తి
యున్నవానికి నరుఁడన * నొదవు నొక్కొ
భయము శత్రుసంహారణోగ్ర * జయముగాక.

విభీ—అన్నయ్యా! రాముఁడు మాత్రము తక్కువవాఁడనుకొంటివా?

చ॥ పసితనమందె తాటకను * బంపెను కాలుని ప్రోలికట్లు, తా
పసవరుశాపకారణము * వల్ల, మహాశిలఁబోలెనున్న నా
కుసుమసమానగాత్రిఁ వడి * కోమలిఁజేసెను గాధిగర్భజా
తు, సవనరక్షణంబునను * ధూర్తులరాక్షసమూకఁ జెండఁగా

ఇదియునుంగాక.

తే. గీ. పెక్కుమాఱులు తోకకు * వ్రేలఁగట్టి
సప్తపాథోధులనుముంచి * సరగనిన్ను

స్నాతుజేయించి యున్నట్టి * జగతివీరు
వాలిఁగూలిచె నొక వాఁడి * కోలచేత.

అట్టివానిఁ జంపనీక కాదమ్ముక్కుంటికయినఁ దరముగాదు. గాన నామాట వినుము.

రావ—ఛీ మూఢుఁడా! ఏమి నీకండకావరము! పడతిఁ నొక్కవీరుఁడు వచ్చి యెత్తికొని పోవుటెఱింగియుం బ్రతికిన్రియ నొనర్పలేని భీరమానవునిఁ బొగడు నీనాలుక నుబట్టి మొదలంట నేలఁగోయఁగూడదు.

విభీ—అన్నయ్యా నేనిందావంతయు నబద్ధమాడలేదు. ఇంకను నామహాత్ముని చేతలఁ జెప్పెదను వినుము తొల్లిసోమకాసురుండను రక్షోవీరుఁడామ్నాయముల నపహరించి వార్ధింబడి డాగియుండ మహామీనమూర్తియయి వానింబరిమార్చి వేదంబులజునకొసంగెను. ప్రహ్లాదుండు హిరణ్యకశిపుఁడు బెట్టుబాధలకోర్వఁజాలక శ్రీహరీయని పిల్చినతోడనే స్తంభంబునుండి జృంభించి గంభీరముగా నాజంభారాతిని నఖాగ్రంబులచే నుదగ్రంబుగ నారసింహుఁడయి చీల్చివయిచెను. ఇది యటుండ జగదవనంబునకు వరుసగా కూర్మాకిట్యాద్యనేకావతారంబులఁ దాల్చెం గాన నాపలుకు లాలింపుము.

ఇంద్ర—అయ్యా! విభీషణా!

తే. గీ. భానుకులజుని పేరెత్తఁ * భయము నీకు
గలుగ నొఁగాక మాకట్లు * గలుగఁబోదు
జంబుకంబన మృగరాజు * జంకునొక్కొ
భయముపఋనొక్కొ గుహఁజొరఁ * బోవునొక్కొ.

అది గాన నింతటితో నాతని ప్రతాపంబు లుగ్గడించుటమాని రాక్షసేంద్రునికోధానలంబు రవిలింపకుము.

విభీ—ఓయి మేఘనాథా! నీవు బాలుఁడవు నీకేమియుఁ దెలియదు గాన నీయధిక ప్రసంగంబింతట జాలించినఁ బాగుగనుండును.

ఇంద్ర—ఏమి నాదియా యధిక ప్రసంగము?

మ॥ శునకంబున్ గొనితెచ్చి గద్దెపయి స * చ్ఛోభన్వసింపంగ జే
సినరీతిన్ మను జాధమున్ ఘనునిగా * జెప్పంగసిగ్గిల్లకుం
డను నామాటలు చెడ్డవంచు వలుక * న్లావెంతగానెంచితో
దను జానీకమునవ్వరే వినఁగ నీ * దంభంబు చాల్చాలులే.

విభీ—ఔరా! ఎంతవాఁడవయితివి. త్రిలోక సంరక్షకుండును నిన్ను సృజిం

చిన విధాత తండ్రియు నగు రామచంద్రుఁడు శునకమా! పాపాత్మా నీకిహపరములుండ
వు సుమా!

ఇంద్ర—ఛీ యీతుచ్ఛ మానవుఁడా నన్ను సృజించినవానికిఁ దండ్రి.

రావ—(పండ్లుగొరుకుచు) ఓరీ విభీషణా కులకలంకా! రాముఁడు దయివంబే
యయినచో వానిభార్యను నేనపహరింపఁజేత కాని వానిఁబోలె చింతించుచుండ నేల? వే
గమేవచ్చి నన్ను జయించి తన జాయను తీసికొని పోఁగూడదా!

విభీ—అదియు నచిరకాలములో నే సంభవించును తొందరఁ జెందకుము.

రావ—అట్లయినఁ భగవంతుని కొకరిసాయమేల ఈకపులను వేఁడ నేల.

విభీ—ఓయి వినుము రామచంద్రుండింకను కొన్ని వందల వత్సరంబుల కవతార
మెత్తునన వాల్మీకి మహర్షి యాయన చరిత్రమును వ్రాసియుండెను. అందుచే నాచరిత్ర
మబద్ధము గాకుండ వాల్మీకుని మాట సత్యమౌనట్లు చరియించుచున్నవాఁడు.

రావ—ఛీ మొట్టమొదట పిట్టలఁగొట్టు కిరాతుఁడయి పిదపఁ బుట్టయందు బుట్టి
కాలకర్మవశమున మౌనియయిన యామూఢునిపల్కుల నాతఁడేల మన్నింపవలెను.

విభీ—అది యామహాత్మునకు భక్తులపయినుండు నవ్యాజకరుణాకటాక్షమే నీవు
నుఁడద్భక్తుండవగుదువేని నీమాటలఁగూడ నాతఁడు దప్పక మన్నించుఁగాన సీతను విడుము.

రావ—ఓ విభీషణా యీమాట వినుము.

తే. గీ. దైవమయినను వానికిఁ * దాతయయిన
విమువఁ బోవను సీతను * భీమజన్య
రంగమందునఁ జెందెద * రామవిభుని
వాని తమ్ముఁడు శోకార్ణ * వంబు జొఱఁగ

ఒకవేళ నట్లు గాకున్నచో.

తే. గీ. ఆతఁడే దైవమై ధర * నలరునేని
జచ్చిపోవుమరణమందె * సంతసమున
నాకలోకముఁ జేరెద * నన్ను జూచి
సురలు వెఱగందఁబరమందు * శోభఁ జెంద.

ఈరెంటిలో నేదియో యొకటి ముమ్మాటికిని తప్పదు.

ఇంద్ర—అమంగళము ప్రతిహతంబగుఁ గాత తండ్రీ! మొదటిదియే తప్పక జరు
గును. ఎవ్వరో మూఢు లాతుమ్ముని దైవమందురుగాని మన బోంట్లు వానినట్లు పలుక
దుమా వెఱతుమా!

రావ—కుమారా! నానిశ్చయమేమో యెఱింగించితివిగాని నేనుమాత్రమాహీన మానవునకు జడియుదునా?

విభీ—అయ్యా! మాటిమాటికినిహీనుడు, తుచ్ఛుడు, మూఢుడని యామహాత్ము ని దూషింపఁదగదు. భగవద్దూషసర్వపాపహేతుభూతముగదా.

తే. గీ. సచ్చిదానందరూపుఁడు * సర్వమయుఁడు
నాదిమధ్యాంతరహితుఁడు * నప్రమేయుఁ
డఖిలలోకావన ధురీణుఁ * డవ్యయుండు
నామహావిష్ణువేసుమీ * రామవిభుఁడు.

అట్టివానిని నిందించుటొప్పగునా?

రావ—(కోపముతో) ఛీ మూర్ఖుఁడా నీదురుపన్యాసమింతటితో విరమింపవేని నిన్నీనిశితాసిధారహతిచే దుత్తునియలుగ గోయింతును.

విభీ—అన్నయ్యా! నన్నేమిచేయించినను సరియే కంఠమునఁ బ్రాణముండువరకు ను నీమేలుఁ గోరకమానను.

రావ—నాకు మేలుఁగోరువాఁడవేయయినచో నిట్టిదురాలాపంబులాడక తోడి వారలందరివోలె సన్మార్గమున నేయుందువు.

విభీ—అన్నా యెంతవెఱ్ఱివాఁడవు నీకు వీరందరును సన్మార్గమునే యుపదేశిం చుచుండిరా.

రావ—కాకమఱి.

విభీ—అట్లయినచో,

తే. గీ. సతులఁ జెఱఁబెట్టి చెఱుపుట * జన్నములను
పాడుసేయుట మొదలగు * పాపకృత్య
ములకు వీరలేగద హేతు * భూతులనఁగ
వలసియున్నది నీవాడు * వెరుసఁజూడ.

రావ—మూర్ఖా వారినేలనిందించెదవు. మన కులధర్మములని మనగురువులగు శు
క్రాచార్యులవారు నుడివియుండలేదా.

విభీ—ఓమూర్ఖుఁడా మనగురువులిట్లు నుడివియుండిరా.

రావ—మరేమి జెప్పిరి.

కం. గురువులగు వారహింసా
పరమోధర్మమని పల్కి * వారలుమఱియున్
బరులకు నుపకారమొనరుపఁ
బరమ శ్రేయంబటంచుఁ * బల్కుదురుసుమా.

నీతిమార్గంబులుపదేశింతురుగాని యిట్టి దుర్నీతులుపదేశింపరు. వారుజెప్పిన పో కడఁబోక మదాంధులయి మనకులమువారు మంచివానిని జెడ్డగాగ్రహించి దుష్పథంబునఁబడి తుదకు విష్ణుదేవుని కోపానలంబునకు శలభాయితులగుచున్నారు. యిదియే దీనియందుండురహస్యము.

ఇంద్ర—(ఎకసక్కెముగా) ఆహాహా రహస్యములన్నియుఁ గ్రహించుచుంటివి. అభినవప్రహ్లాదుండవుగాఁబోలు. అట్లయిన మనవంశము నుద్ధరింపఁబుట్టినవాఁడవే. నీజ్ఞానాతిశయమువల్ల మన పితామహప్రపితామహులు తరింతురు.

విభీ—(కోపముతో) అవును మనవంశమును నేనెప్పుడును నుద్ధరించెడివాఁడనే యిఁక,

తే. గీ. స్వచ్ఛమయినట్టి యీవిధి * సంతతినిట
రూపుమాపంగఁబుట్టిన * పాపకర్ము
లకట నీవును నీతండ్రి * యనిసిమాడ
నీదుపినతండ్రి (అని సేనలవైపునకుఁజూపి)
మఱియిట్టి * నీబలంబు.

[illegible]మును మాపఁబుట్టినవారే మొన్న నే యొక్కకపిచేత సగము మాపఁబడినది

తక్కినసగమును వానలువురిసల్లను మాయును.

రావ—(మహాకోపముతో) ఓరీదురాత్మ వైరిబలాభివర్ణనప్రియా రాక్షసాన్వయ బడబానల. ఏమిరా నీకండకావరము. నేనూరకుంటినని నోటికివచ్చినట్లు వదరసాహసించుచుంటివి. ఇంతటితో గట్టిపెట్టకుందువేని పీటనుండి బాఱఁదోలెద.

విభీ—అన్నా యిట్లొనరింపనేల? నీవేమొనరించిన ననుభవించుటకు సిద్ధముగా నుంటినని యిదివరకే మనవిచేసికొనియుంటిని. సర్వంబునకును నాకారాముఁడేతోడు.

రావ—(పండ్లుగొరుకుచు) ఛీ! మూర్ఖా యింకను రామునిమాట మానవుగా నా కండ్లయెదుటనుండి తొలఁగిపొమ్ము.

(అని తన్నుట నభినయించును.)

విభీ—హా రామచంద్రా రక్షింపుము రక్షింపుము. ఓయీ నేనిదె పోవుచుంటిని గాన నా చిన్నవిన్నపమాలింపుము.

తే. గీ. వానరులు రామచంద్రుఁడు * వార్థిదాటి
వచ్చుచున్నారటంచు నీ * వారు దెల్ప
భూతనూజాత లోకైక * మాతసీత
నర్పణముఁజేసి రక్షింపు * మనఁగవలయు.

అప్పుడుగాకుండిన,

తే. గీ. లంకముట్టడిగావించి * కింకరులను
ద్రెళ్ళఁజేసినయీవార్త * దెలియఁగానె
భూతనూజాత లోకైక * మాతసీత
నర్పణముఁజేసి రక్షింపు * మనఁగవలయు.

అప్పుడు సైతముఁ గాకుండిన,

తే. గీ. ఇంద్రజిత్తునుహింసించి * యితరఘనుల
లక్ష్మణుఁడు శౌర్యవృత్తిఁగ * లంచువేళ

భూతనూజాత లోకైక * మాతసీత
నర్పణముఁ జేసి రక్షింపు * మనఁగవలయు.

రావ—(చిఱునవ్వుతో) అయినదా నీభావినూచికోపన్యాసము. పాపము చాలకష్టపడితివి. ఇంతట సెలవు గైకొనుము.

విభీ—నీకు నామాటలిపుడు గష్టములుగానె తోఁచినను గార్యముపట్ల నిశ్చయములుగాఁ దోచకమానవు. అయిన నింకొక ప్రార్థనముగలదు. అవధరింపుము. ఆరామచంద్రుండు,

తే. గీ. నిన్నెదుర్కొని బాణాగ్ని * నెఱపినీదు
శక్తియుక్తులు భస్మంబు * సలుపువేళ
భూతనూజాత లోకైక * మాతసీత
నర్పణముఁ జేసి రక్షింపు * మనఁగవలయు.

రావ—ఓరీ! పిఱికిపందా! విభీషణా అనిచమానవుఁడు నన్నెదుర్కొనుటయు నాశక్తియుక్తులు భస్మము సేయుటయునా? చాలు చాలు. ఇంక నేనుపేక్షించిన నీవిట్లేకూయుచుందువు.

విభీ—అన్నా! నాయీకడపటిప్రార్థనంబొక్కటియైన నీమదిని నాటించుకొనుమని విన్నవించుకొనుచున్నవాఁడ.

తే. గీ. లోకనాథుండు నీకంత * లుంఠనంబు
సేయునపుడేని వైరమూని * చిత్తశుద్ధి
తోడ నవ్వాని మృదుపాద * తోయజముల
భక్తిభజియింపుమాయిదే * ముక్తిపథము.

మఱియు నీవు మూఢమార్గంబునఁబడి,

తే. గీ. అష్టదిక్పాలవర్యుల * నదిమినాఁడ
బ్రహ్మమెప్పించివరములఁ * బడసినాఁడ
ననుచు గర్వించుచుంటివా * యష్టదిక్ప
తులకుఁ బతిబ్రహ్మకును బ్రహ్మ * దలఁచిచూడ.

కాన నామాటపాటింపుము. ఇదే నేనేఁగెద దయయుంచుము. (అని యావలకువచ్చి తనలో) యీమూర్ఖునికెన్ని జెప్పినను వినకున్నవాఁడు వీనిమౌఢ్యసన్నిపాతజ్వరంబునకు రామబాణమే పరమౌషధంబు. ఇఁక నేబోయి యామహాత్మునిశరణుజొచ్చెద నింతకు నటకుఁబోవ నాతఁడు నన్నుఁ గాచునో గావఁడో దీనజనావనదీక్షాపరతంత్రుఁడగు రాముఁడేల నన్నుఁ గావఁడు. ఎటులయినను మంచిదే పోయెదఁగాక.

(అని నిష్క్రమించును.)

రావ—(తనలో) అమ్మయ్యా యిప్పటికి లంకనావహించిన శనిగ్రహము వదలినని. ఇఁక నభ్యుదయంబులకు రవంతయుఁ గొఱంతయుండదు. నేనిప్పుడపోయి యాజానకి యేమిచేయుచున్నదో చూచెదఁగాక (ప్రకాశముగా) కుమారా మనముఁగూడ బోవుదమురమ్ము.

(అని అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము-

(మాల్యవంతపర్వతమున రాముఁడు వెన్నెలలో నొక తలిరాకుసెజ్జపయిఁబండి ప్రవేశించును)

రాము—(నిట్టూర్పు విడిచి) అక్కటా!

సీ. మలయమారుత మను * మంటలందునఁ జిక్కి
యెన్నాళ్లు గడుపుదు * నింతిఁబాసి

కామబాణములను * గంటకంబులఁబడి
యెన్నాళ్లు గడుపుదు * నింతిఁబాసి
కేవేలుంగులఁజేసి * గావరంబును డాసి
యెన్నాళ్లు గడుపుదు * నింతిఁబాసి
గండుకోయిలదండు * గలిగించుకొదవించు
నెన్నాళ్లు గడుపుదు * నింతిఁబాసి

గీ. తేఁటిపాటల నాలించి * బోఁటికొఱకు
వంతజెందుచు మదిని సు * మంతయైనఁ
గుదురులేకుండఁ గడగండ్లఁ * గుడుచుచిట్టు
లెన్నినాళులు గడుపుదు * నింతిఁబాసి.

అయ్యో యీమారుఁడు నన్ను బ్రతుక నిచ్చునా?

తే. గీ. చెఱకు వింటికి నళులను * గఱునారి
గా నొనర్చియు విరులా శు * గములఁజేసి
చిలుకరథముపై నెక్కి దా * జెనటియగుచుఁ
జంప నుంకించుచున్నాఁడు * సాహసమున.

ఓకీమారా! నీకీ కాఠిన్య మేల? నా చెలియున్నచో నీవే యేటఁగలతువు నీదనుష్టం కారమే మంటవంటును. నీరథమే తరువెక్కును. అతనుఁడవయినను తనువుఁ గలవాని కంటె నెక్కువవీరమును జూపుచుంటివి. ఇదియటుండనోమూఢ! లోకమునందు " సర్వాం నాశాయమాతులా " యను నార్యవచనాను కూలముగ నీ మైనమామ.

తే. గీ. నిన్ను మసిజేసినట్టి యా * నీలకంఠు
జడముఁ బువ్వొంచు నలరఁడే * చందురుండు

తలఁచఁబోకుము చుట్టమే * దనరెననుచు
నెచ్చుతగ్గులు గలవారి * మెచ్చఁదగునె.

అది గాన నీకాతఁడు బాసటయైయుండెనని నిక్కఁబోక నీవిక్రమంబింతటితోఁ గట్టి పెట్టుము.

[ప్రవేశము—హనుమంతుఁడు]

హను—(తనలో) అక్కటా యీమహారాజు జానకీవియోగ బాధచే మదనాక్రాంబడియున్నవాఁడు. ఈతనికొరకా రావణుని తమ్ముఁడేతెంచి శ్రీరామచద్రుం జూపుమని బాధించుచున్నాఁడు. లక్ష్మణుండును రాముని కెఱింగించుమని నన్నుంబంచె పోయి విన్నవించెదఁగాక (అని సమీపించి ప్రకాశముగా) జయము జయము రాఘవేంద్రా.

రాము—(వినకయే) ఓకీచంద్రా! ఏమి నీ కండకావరము.

తే. గీ. గురువు గృహమందు లేనట్టి * తరుణమందు
వాని సతిఁబట్టియుంటివి * పాపకర్మ
పరమ ఛండాలుఁడా తుళ్లి * పడెదవేల
రాహువనుమ్రింగుఁగాక ప * ర్వంబునందు.

హను—(తనలో) ఓహో ఈతఁడు నామాట వినకయే చంద్రదూషణ మొనరించుచున్నవాఁడు (ప్రకాశముగా) నిక్కముగా నట్లె జరుగును స్వామి,

రాము—(హనుమంతునిఁ జూచి వెఱఁగంది) హనుమా! ఎంత సేపయినది. నీవిటకు వచ్చి ఈరాత్రివేళనిటకు రాగతమేమి?

హను—స్వామి రావణుని తమ్ముఁడగు విభీషణుఁడు వచ్చి యున్నాఁడు వానికి మీదర్శనము గావలెనఁట.

రాము—అంజనీగర్భజాత! ఆతఁడు గపటత్వంబున వచ్చెనా? లేక మన పయింగల భక్తిచే వచ్చెనా?

హను—దేవా యాతఁడు రాక్షసుఁడయినను సద్ధర్మప్రధానుగామి, సుజనాగ్రేసరుఁడు, సద్గుణనిధి ఆతనికడ దైత్యకృత్యంబు లేవియుఁ గానరావు. నేను లంకాపురంబున నాతని చర్యలఁ గాంచితిని.

రాము—అట్లయిన నీక శంకయేల? లక్ష్మణ సహితంబుగా వాని నిటకుఁ దోడ్కొని రమ్ము.

(అంతట హనుమంతుఁడు నిష్క్రమించి లక్ష్మణ విభీషణులతోఁ బ్రవేశించును)

లక్ష్మ—అగ్రజా! వందనము.

రాము—తమ్ముఁడా యిటురమ్ము (అని ప్రక్కను గూర్చుండఁబెట్టుకొనును)

విభీ—(చేతులు జోడించి)

మ. కరుణాసాగరరామచంద్ర నతభ * క్త వ్రాత కల్పద్రుమా!
సురయక్షోరగసిద్ధసాధ్య మిథిలా * శుద్ధాంతకాంతా మనః
పరభృత్స్వాదిత సన్మరందయుత శుం * భత్పాద పంకేరుహా!
కరణీరక్షణ దుష్టశోషణ జగ * త్కల్యాణ సంస్థాపకా.

మఱియు నో దేవదేవ,

మ. నినులోకుల్ గ్రహియింపలేక ప్రకృతిన్ * నిర్మగ్నచేతస్కులై
మనుచున్నారు ధరిత్రిలో మఱియు నీమా * హాత్మ్యముల్ దేటగా
కనయంబున్ నయదూరులై నరుఁడెకా * దాయంచు భావింతురో
యనఘా! నాకది దుర్భరంబగుటనే * బ్రార్థింతునిన్ భక్తితో.

ఇవన్నియునటుండ,

తే. గీ. నీసతీరత్నమును గను * నీచుఁడగుచు
నెత్తికొని రాదశముఖుఁడు * కేనుసీతి

జెప్పఁబూనినఁగోపించి * వెనఁటియగుచు
లేవనడచెనుగాన నన్ను * గావవయ్య.

లక్ష్మ—ఓయి రాక్షసకులావతంసా నీవు రావణునకు నీతిఁజెప్పఁబూనిన నిన్నా పురంబునుండి వెడలఁగొట్టెనా! రాక్షసుండవగు నీకు నీతియుండునని యెవ్వరునమ్ముదురు?

విభీ—స్వామి? నాకు నీతియున్నదో లేదో సర్వజగత్కారణుండగు నాభగవంతుఁడెఱుంగును మీకు నేను వేఱజెప్పనేల?

రాము—విభీషణా! ఆతనిమాటలకేమిగాని నీవియ్యెడకురాఁగత మేమంటివి?

విభీ—(తనలో) ఏమిచెప్పుదు! యీతఁడు నన్నుఁ దిరిగి యడుగుచుండెను. నా మాటలునమ్మశక్యముగాకుండెనాయేమి?

తే. గీ. మాత్సర్యమునువీడి త్వత్సతీ * మణినిమీకు
నొసఁగుమంచునుజెప్పిన * నోర్వలేక
కావరంబున పురినుండి * లేవఁగొట్టె
సరససద్గుణ శ్రీరామ * శరణుశరణు.

రాము—(హనుమంతునివైపుజూచి యాలోచించుచు.)

హను—(జనాంతికముగా) స్వామి మీరీతని సంశయింపఁబనిలేదు. ఈతఁడు మీభక్తకోటిలోనివాఁడె నాఁడు రావణుఁడు నన్నుఁబట్టి తెప్పించి చంపయత్నింప నీతఁడు దూతను వధించుట రాజధర్మముకాదని చెప్పి వారించెను. జానకీమహాదేవిని విడిపించుమని పెక్కుమారులు ప్రార్థించెను. ఈతనియందావంతయు దోషములేదు గానఁ గాపాడఁదగినవాఁడు.

రాము—మంచిది. (అని విభీషణునిఁ జూచి) ఓయిరాక్షసరాజా నిన్నుఁ గాంచఁగనే నీవు సన్మార్గుఁడవని మాకుఁ దోఁచుచున్నది. రక్షింతుముగాని రాక్షసుండవగు నీవు నీబంధులనందఱవిడిచి నీయన్ననువిడిచి నన్ను శరణుజొచ్చుటకుఁ బంక్తికంధరుఁ డొనర నేమేమిదోషములఁ గాంచితివి.

విభీ—మహాత్మా! ఒకటననేల చెప్పరానివియుఁ జేయరానివియు నగు దుష్టకార్యములనేకములాచరించినాఁడు. మహాసాధ్వియగు జనకజు గాఱించుట చాలదా?

రాము—(క్రోధముతో) ఏమి. జనకజను పలుసిలుగులఁ బెట్టి యాలముచుండెనుగా. ఓరీ మాతృద్రోహీ దశాననా?

తే. గీ. ఘోరసంగ్రామతలమున * క్రూరనిశిత
బాణపంక్తుల కెఱజేతుఁ * బాపకర్మ
ఎవఁడు తన ధైర్యసాహస * వృత్తి మెఱయఁ
గావఁగలవాఁడో శూరుఁడై * కాంతుఁగాక.

మఱియు నో విభీషణా యిది వినుము.

మ. ధరణిన్ డాగిన వార్ధిఁ జొచ్చిన ననిన్ * దర్పంబుఁ జూపించినన్
సురలుత్సాహముఁ జెంద దైత్యవితతుల్ * శోకంబునొందంగ సం
గరరంగంబునఁ బంక్తికంధరుఁ బ్రతి * జ్ఞన్ బూని హింసింతునిన్
బఱగన్ జేతు నిశాచరప్రభునిగా * వాత్సల్యమేపారఁగన్.

ఈపలుకు ముమ్మాటికిని సత్యము. నీకుఁ దప్పక లంకారాజ్యంబభిషేకంబొనరించెద తమ్ముఁడా శుద్ధోదకంబుల నిటు దెమ్ము. నేనిప్పుడ వీనికిఁ బట్టంబుగట్టెద.

లక్ష్మ—అన్నయ్యా జయాపజయంబులు దైవికంబులు గదా. ఒకవేళ మీరలా రావణుని జయింప లేకుండిన నీతనికి లంకారాజ్యం బెట్లు వచ్చును. అప్పుడు మీరేమి యొనర్తురు.

రాము—అట్టొక వేళ సంభవించు నేని.

తే. గీ. పంక్తివక్త్రుని నిర్జింప * బలము లేక
వానికై జక్కి తూలుట * ప్రాప్తమయిన

నాదురాజ్యాది సర్వంబు * మోదమలర
దైత్యనాథునికిత్తు స * త్యంబుగాగ.

ఇంక సంశయింపం బనిలేదు.

లక్ష్మ—అట్లయిన నిదిగో శుద్ధనీరంబులతో నున్న కలశము.

రాము—విభీషణా నీచేయిటుదెమ్ము. (అని పుచ్చుకుని లంకారాజ్యమును ధారవోయును)

హను—(సంతసముతోం దనలో) శహబాస్ రాఘవేంద్రా నిన్నుం బోలిన మహానుభావుని నే నెందునుం జూడలేను.)

విభీ—(తనలో) నహ్హా నాకష్టములు గట్టెక్కినవి. ధన్యుండనయితిని (ప్రకాశముగా) స్వామి మీరు నాకు జేయంబూనిన యుపకారంబునకుం జాల సంతోషాంతరంగుండ నయితిని మహాత్మా! రావణుని పురంబునందు గల విశేషంబులు గొన్ని విశదపఱిచెద నాకర్ణింపుము.

తే. గీ. కోట్లకొలందిగ నున్నారు * క్రూరదనుజ
వీరవర్యులు బలన్నైరి * బీరముడుప
గల్గు బలపరాక్రమ శౌర్య * ఘనులుంగాన
నప్రమత్తత విజయంబు * నందవలయు.

మఱియు.

తే. గీ. ఇంద్రజిత్తనువాండు మ * హేంద్రుంబట్టి
తెచ్చి చెఱసాలబంధించె * దెగువమీఱ
కుంభకర్ణుండు రావణు * కూర్మితమ్ముం
డతిబలుండు నిద్రిమత్తుండై * యచటం గలండు.

ఇంక నతికాయ, మహాకాయ, అకంపన, మహోదర, కుంభ, పార్శ్వ, నికుంభ, ఏకవక్త్ర, ద్వివక్త్ర, త్రివక్త్రాద్యనేక రాక్షసవాహినీ నాయకులును ముఖ్యమంత్రులు నయి యుందురు గాన యుద్ధంబున మీరు బహు జాగరూకులయి యుండవలయును.

రాము—(నిరసనముగా) ఓయీ! యిట్టి వారలెందఱుండిన మనకేమి భయము,

ఆ. వె. సూనృతంబు మనకు * సొంపుగూర్చెడి తల్లి
యనృతమెన్నవారి * కనుఁగుఁదల్లి
ధర్మపథము మనకు * దప్పక శుభమిచ్చు
దుష్టపథము వారి * దునుమడెంచు

వారికిని మనకునుఁ గల తారతమ్యమది గాన నీవావంతయు విచారింపవలసిన పని లేదు. మఱియును,

మ. బలరిపుఁబట్టియున్న మటి * బ్రహ్మనుబట్టిన నింద్రజిత్తు శౌ
ర్యలవమడీయదారుణశ * రంబుల స్రుక్కుచు నేలఁ గూలదే
విలవిల దన్నుకొంచు సురు * వీడఁడె నిద్రముదంబు వోవఁగాఁ
గల నను రావణానుజుఁడు * గల్గడె ఖేదము రాక్షసాళికిన్.

విభీ—దేవా! అట్లయిన నీకు సందియంబేల రేపటిదినముననే యేల యుద్ధంబున కీ బయలు దేరకూడదు.

లక్ష్మ—ఓయి కూడకపోవుటేల? మేము నట్లె నిశ్చయించి యుంటిమి.

రాము—వానరేంద్రా! నీవు పోయి మీప్రభువగు సుగ్రీవునితో నాపలుకులుగా నొక్కిచెప్పుము.

సీ. స్నేహదోడనింజావ * సంతోషజలధి నీ
ర్మగ్నుండనై నన్ను * మఱచినావు

కపిసేనతో నాకు * గలసమందునఁ దోడు
గా వత్తునని మాటఁ * గడఁగితీవు
రాజ్యభోగంబుల * రహిఁజెందువాఁడవై
మము నిరసించితే * మర్కటేంద్రి
యిఁకనైన వత్తువో * యీరీతి మసలుదో
తెలియ జెప్పుము తేట * తెల్లముగను.

తే. గీ. మొదట నిటువంటి వాఁడవం * చెదను నెంచ
కగ్నిసాక్షిగ సఖ్యమే * సమరఁ జేసి
యుండినాఁడను నాపని * నొసరఁచితిని
నా ఋణంబునఁ బడియుండి * నాఁడవీవు.

ఇదియటుండ నెల్లి ప్రయాణమగుఁ గానఁ గృతజ్ఞుఁడవయి సేనల సిద్ధపరుపుము; హనుమా! నీవిఁకఁబొమ్ము.

హను—మహాప్రసాదము. (అని నిష్క్రమించును)

విభీ—(తనలో) అక్కటా! రావణుఁడు తన చావుకొరకే నిరీక్షించుచున్నాఁడు పోనిమ్ము. మధ్యనాకేల? (ప్రకాశముగా) తరణికులేంద్రా మనముఁ గూడ బోవుదము రండు.

రాము—మంచిది (తనలో) ఓకీకుంభకర్ణా.

తే. గీ. ఆరుమాసంబులకు నొకొ * మారునిద్ర
మేలుకొందు వటందురు * చాలదేమొ
పెద్దనిద్దుర బొందించి * ప్రేతరాజ
పురికిఁ బంపెద సౌఖ్యముల్ * బొందుపదుగ.

నీకునుఁగాల మాసన్నమయినదిలే (అంతట విభీషణ రాములు విష్క్రమింతురు)

లక్ష్మ — (తనలో) ఓరోరి మేఘనాథా.

తే. గీ. ఇంద్రుఁడే యోడెనా కేమి * చంద్రమౌళి
సాయమున్నాఁడు నరులను * జంపువాఁడ
ననుచు గర్వింపఁ బోకు ని * న్నణఁచువాఁడు
లక్ష్మణుం డొకఁడు గలఁ డియ్యి * లాతలమున.

తొందర పడకుము.

(అని నిష్క్రమించును)

ఇది ద్వితీయాంకము.



# ప్రచండరాఘవము.

## తృతీయాంకము.

---

లంకాపురీబయలు—ప్రవేశము కుంభుఁడు.

కుంభు—(తనలో) నేఁడు మారాక్షస నాయకుండగు దశకంఠునిపయికిఁ దవజా యనెత్తికొని వచ్చినాఁడను క్రోధంబున నరుఁడగు రాముఁడు మితిమీరిన గోతిమూకం గూర్చుకుని దండెత్తి వచ్చినాఁడు. అందుచేత నాతఁడు నన్ను వారి బలమెంతదియో మారువేషంబున నరసిరమ్మని యానతిచ్చె. పోయి చూచెదఁగాక. (అని ముందునకు నడచి) అదిగో నామిత్రుఁడగు నికుంభుఁడిదె నేనున్నదెసకే వచ్చుచున్నాఁడు. వాఁడెవ్వరికొరకో వెదకులాడుచున్నట్లున్నది. వీనితో నించుకసేపు వినోదించెదఁగాక.

(అని ప్రక్కను నిలుచుండును ప్రవేశము నికుంభుఁడు)

నికుం—(తనలో) నేఁటిదినమున నామిత్రుఁడగు నింద్రజిత్తు తాను జననమంది యుండుటచే నాకలోకాధినాథుండగు నింద్రుని రావించి వానివలన నచ్చరలంబిలిపించి వారలతోఁ గేళివిలాసంబుల సలుపనెంచి యింద్రుందోడితెమ్మని నన్నుఁబంచె అబ్బబ్బా కాళ్లు పొక్కులెక్కినవి నోట దడియారె నడయాడుపాటిదీరె నిట్లున్నను నింద్రుఁడుగాని గింద్రుఁడు గాని యచ్చరలు గాని గిచ్చరలు గాని కనుపింపరైరి. వారిజాడ నెఱింగించు వారెవరును లేక పోయిరని చెప్పిన వీరేమందురో. (అని యిటునటుచూచుచు)

కుంభు—(సమీపించి ప్రకాశముగా) తాతా ఎవరికోసము ప్రతీక్షించుచుంటివి.

నికుం—నాయనా! నీకెక్కడనయిన నింద్రుఁడు కనుపించెనా?

కుంభు—ఆ కనుపించినాఁడు వానికేమయిన నానవాళ్లుండినఁ జెప్పుము.

నికుం—ఆతఁడు తెల్లటి దేహము గలాఁడు. ఆజానబాహుయుగ్మఁడు కుడిచేత వజ్రాయుధముండును. వదనంబున నంగతోటలోని దిష్టిపిడత చుక్కలవలె వేయికన్నులుండును. ఆవిరిదుబ్బవలె మీసములుండును. మఱియుఁ గొంచెము పొడుగు పాటివాఁడు.

కుంభు — ఇంతియేనా నీవెఱింగిన యానవాళ్ళు? అట్లయిన నిన్నసాయంకాలమున మనశివాలయపువీధిం బోవుచున్నట్లు నామిత్రుఁడు జెప్పెను- పోయిచూచిరమ్ము.

నికుం — ఓరి నీకడుపుకాల నిన్నసాయంసమయంబునఁ బోవుచుండిన నిప్పుడెట్లు దొరకును.

కుంభు — ఏమి. యీదివసంబున మాత్రమట్లు పోవుచుండఁగూడదా కాని నగవైరితో నిప్పుడంత యగత్యమేమి?

నికుం — ఓరీ యెఱుంగవా? నేఁడు మనయువరాజుగారి పుట్టినదినము అందుచే నాయన దేవవారనారీమణీ సరససంగీత భంగీతరంగ రంగద్ఘోభనాల నాకర్ణింప మోద మందె మేళనాయకుఁడగు సురరాజును దోడ్కొనిరమ్మనెను.

కుంభు — బలే యిఁక నేమి? నీరొట్టె నేతిలోఁబడినది.

నికుం — ఏమట్లనుచుంటివి?

కుంభు — ఇఁక నీకుగావలసినంత, తినఁజాలినంత దూదిపేడ. ఆవుపేడ. బూరెలు. బూచులు. గారెలు. గాడిదలు దొరుకును.

నికుం — (కోపముతో) ఛీ! ఏమి నీ పేలాపన.

కుంభు — తాతా! పిండివంటల పేర్లఁజెప్పినఁ బేలాపనయని తన్నులగొడ్డులాగున గోపించెదవేమి నీకివియిష్టములేవా?

నికుం — ఓరీ నీకీరోజున గురుఁడు బదునాలుగింటఁ బ్రవేశించెనాయేమి?

కుంభు — మనచక్రవర్తిగారు చల్లగానున్నంతకాలమును మనకెద్దానికిని లోపముండదు. పాద్దుబోవుచున్నదిఁక నేబోవలెను.

నికుం — ఎక్కడికేగెదవు?

కుంభు — అట్లడుగకుము. అమంగళప్రదము.

నికుం — పోనీ! ఏమిపనిమీద నేగెదవు. తిరిగి యెప్పుడువత్తువు?

కుంభు — ఓరీ శకునపక్షీ వద్దనిన నట్లేయడిగెదవేల? నేనొక రాచకార్యముకొరకేగుచుంటిని.

నికుం — ఏమిటా రాచకార్యము?

కుంభు — ఇదిగోవినుము. శ్రీరాముని భార్యను మనప్రభునెత్తుకొనివచ్చు టెఱుంగుదువా?

నికుం—ఆ యెఱుఁగుదును. తరువాత.

కుంభ—తరువాత నానరుఁడొక కోతిని సీతయునికి నెఱింగిరమ్మనిపంపెను. వాఁడును శతయోజనవిస్తీర్ణంబయి పుష్కలావర్తమేఘఘోరగర్జారవ ప్రతిమానచలద్వీచీ మహోత్కటఘూర్ణితధ్వానంబులచే హల్లకల్లోలమయి యున్న నమ్మహార్ణవంబును ఝరీ ప్రాయంబుగనెంచి దాటి లంకనుబ్రవేశించి సీతనేమమెఱింగి యనేక రాక్షసానీకంబుల నేలకుం గోలకుం దెచ్చి లంకాపురీదహనమయినతరువాత రామునికడకేగి సంగతులు విన్నవించెను.

నికుం—అబ్బా కోతియేనా యింతపనిచేసినది. దానినప్పుడు నీవేల నమిలితివి గావురా?

కుంభ—అది కోతిగాదురా బాబు మనవంటివారినెందరినో కడతేర్చ తగులఁబెట్టిన జ్యోతిరా!

నికుం—తరువాత నేమిజరిగినది.

కుంభ—అంతట నారాముండు మితిమీరిన మర్కటదండుంగూర్చుకుని సముద్రంబునకడ్డంబుగా శిలలచేతను తరువులచేతను యిసుకచేతనుఁ గొండలచేతనుఁ బెద్దసేతువు నొకదానిఁగట్టి మనవీటఁబ్రవేశించి నేటికి దినసప్తయంబయినది. వీరలేతెంచిన సంగతి దశవదనునకు నేఁడు తెలిసినది. అందుచే నాయన నన్ను వారిబలమెంతో మారువేషంబునఁబోయి చూచిరమ్మని చెప్పెను. గాన నే నేగుచుంటిని.

నికుం—అట్లయిన నిఁక రామరావణులకు యుద్ధము సిద్ధముగాఁబోలు.

కుంభ—ఏలతప్పును. ఈతఁడు సీతనువిడువఁడు. వాఁడుఁ గొనిపోవకమానఁడు.

నికుం—ఓరీ మనమిద్దరమును సమానబుద్ధిమంతులమేగనుక జయమెవ్వారికైవున నుండునని యెంచెదవు.

కుంభ—సఖా! మనరావణుఁడప్రతీపప్రతాపవంతుఁడు గదా కాన నాతఁడే గెల్చును.

నికుం—నాయూహ నెఱుంగుదువా తొల్లి మనప్రభువు దపంబొనరించినప్పుడు సకలజీవులవల్లను జావులేకుండ వరముఁగొనెనుగాని వానరులవల్ల మాత్రము గైకొనలేదు. అందుచే నేనించుక శంకించుచున్నాఁడ.

కుంభ—ఔరా! మూర్ఖా తిన్నయింటి వాసములనెన్నెడివానిరీతిని గాదికిందిపందికొక్కులాగున తేనెపూసినకత్తికైవడిని మేకవన్నియబెబ్బులియట్లు యిన్నాళ్ళనుండియు రావణునియన్నముఁ దినుచుఁ దుదకు వానికి జయముకాదని నుడివెదవా? ఈసంగతి వానితోఁజెప్పి నిన్ను ముక్కలఁగ్రిందఁ జెక్కించకున్న నిక్కముగా నాపేరు కుంభుఁడు గాదు చూడు.

నికుం—(భయముతో) నాతండ్రీ నానాయనా! ముసలివాడనగుటచే మాటపడబడి నోటివట్టుపుకూతఁగూసితిని నన్ను క్షమియింపుము. అట్లొనర్చినచో నీఋణము మరపటిజన్మంబున నీబానిసనయిపుట్టి తీర్చుకొనియెద (అని కాళ్ళమీఁదఁబడును.)

కుంభ—సరే నిన్ను క్షమించితిని. ఇంకముందెన్నఁడును యిట్టి వాగుడు వాగకుము.

నికుం—(తనలో) అమ్మయ్యా యిప్పటికిఁగండము గడిచి పిండము బయటఁబడ్డది. ఇఁక నిక్కడనే యున్నచో నితఁడే యేదోయొకమాట ననుచుంగును. దాన వీనికిఁగోపము వచ్చి రావణునితోఁజెప్పిన నాకిదివరకున్న గోడుకూడఁ జెడును. (ప్రకాశముగా) ఓసీ యిఁక మనపనులమీఁద మనము పోవుదము రమ్ము.

కుంభ—మంచిది.

(అంతట నిరువురు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

ప్రథమరంగము—అశోకవనము.

---

[ప్రవేశము—ఏకజట, త్రిజట, జానకి.]

జాన—(దుఃఖముతో) అక్కటా.

మ. ప్లవగేంద్రుండిటనుండిపోయి యొకనె * ళ్లాయెఁ దానేటికో
రవివంశోత్తముఁడింక రాఁడిచట నీ * రక్షోవిభుండుగ్రుఁడై

జవరాండ్రింగడు దుష్టబోధనలకై * సంధించి కాపుంచె హా!
లవమున బాప భయంబులేక! విధిదు * ర్లంఘ్యంబెకా! యేరికిన్.

యెన్నిదినంబులీ రాక్షసాంగనల నడుమ నిక్కట్లు జెందుచుఁ గాలంబు గడుపుదాన. మన్నాథునకింకను నాపయిననుగ్రహంబు వొడమినదికాదు. ఈరావణుండు,

తే. గీ. ఒక్కమాసంబు గడువిచ్చె * నుల్లమలరఁ
దన్ను నుద్వాహమాడక * దప్పదనుచు
లేకయుండినఁ జంపించి * గాకిమూఁక
కరయబలియిచ్చువాఁడ * సంచలిగిపలికె.

అయ్యారే యేమి నాపూర్వకర్మపరిపాకము.

మ. అకటా! పూర్వభవంబులోఁ గపటినై * యజ్ఞానినై లోకులన్
వికటత్వంబున నెట్టియాపదల నే * బెట్టంగ నీకొంటినో
యకలంకాత్ములు వారు గష్టముఁ బా * లై యెంత చింతించిరో
సకలంబిప్పుడు ప్రాప్తమయ్యెఁగద యీ * జన్మంబునందారయన్.

ఛీ! ఛీ! యీయాడుజన్మము నెత్తుటకంటె మహాటవీమధ్యంబున నొక్క గ్రావంబై పుట్టుటదృష్టము. ఒక్కనాటిదికాదు. ఒక్కవిధమయిన పరితాపముఁగాదు. పుట్టినది మొదలిట్టులే గట్టడిదైవంబిక్కట్టులు బెట్టుచుండె. (ప్రకాశముగా) త్రిజటా యెన్నటికయిన రామచంద్రుని ముఖవీక్షణభాగ్యంబీ నిర్భాగ్యురాలికబ్బునే.

త్రిజ — అమ్మా మైథిలీ! ఆపదలు కాపురంబులో నొప్పవుగదా. భగవదేచ్ఛ యెంత కాలమో యంతవరకును వర్తనిన్న నేతెంచుమనేయుండును. మఱియును నిన్నటిదినంబున రఘుకులేంద్రుఁడేతెంచి రావణసంహారంబు గావించి నిన్ను గంధద్విపంబుపై నెక్కించుకొని తీసికొనిపోయినట్లొక స్వప్నంబుఁ గాంచితిని. కావున చింతింపకుము.

జాన — చెలీ కలలు నిక్కమగునా. ఆతఁడు వచ్చుటయు నన్నుఁ గొంపోవుటయు

దూర్వపశ్చిమకమమలకున్నంతదాపు. అంతటిభాగ్యమేయున్న నాతని సమక్షంబునసే యుండియుందును.

త్రిజ—స్వప్నములబద్ధమనుట నిజమేకాని యిదిమాత్రము సత్యమగునని దలంచెద నేలయన రఘూద్వహుండు సకలచరాచరోద్భూతస్థితిల యకారణుండగు మహావిష్ణువుగాని సామాన్యుఁడుగాఁడు. నీవుఁ దద్ధాంగలక్ష్మినగుటంజేసి రమాసతివిగాని మానవాంగనవుగావు. అందుచే మీవిషయమయి గనినసంగతి వమ్ముకానేరదు. కాలవశంబున నిట్టివంతలు సంప్రాప్తమయినవి.

జాన—నిజమువచించితివి. కాకున్నచో,

సీ. కైకేయిబోధ్యల * కారణంబునఁదండ్రి
వరకుమారు వనికిఁ * బంపనేల?
పంపెబో వనమందు * బ్రతుకనీయక శూర్ప
ణఖ రామచంద్రుఁ * గనంగనేల?
కనినమాత్రంబున * గరిత మోహరసాప్రి
పూరితయైవానిఁ * గోరనేల?
కోరియుండినఁ దాను * గోలకాయని క్షమి
యింపకదాని శి * క్షింపనేల?
దే. గీ. అంతమాత్రాన సదిపోయి * యన్నతోడ
నడిచినట్టివిధంబును * నుడువనేల?
నుడివియుండిన నాతండు * జడతనన్ను
గొంచుఁబోనేల? తనపురి * నుంచనేల.

విజ—దైవఘటన కిట్లేమొనర్పఁగలరు. అఘటిన ఘటనాసమర్థుండగు దేవదేవుని నిటలతటఘటితాంజలీ పుటలమై ప్రార్థించుచుంటయే కర్తవ్యము. పోవుదమురండు.

జాన—మంచిది. (అంతట అందరు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము లంకాపురీబాహ్యప్రదేశము.

[రామలక్ష్మణవిభీషణహనుమంతులు]

రాము—విభీషణా!

తే. గీ. ఘనుఁడల జటాయువు నుడివె * గిరిశపోక
గపికులేంద్రుఁడు దోడయ్యె * గలనొసర్ప
నంజనీపుత్రుఁడవనిజ * నరసివచ్చె
నీవొనర్చెడి సాయమేమో * వచింపు.

విభీ—(వినయముగా) సకల జగత్కారణులగు దేవరవారికి నాబోఁటి పాపుఁడే మొనర్పఁగలఁడు అయినను నాయోపినంతవరకు గొన్ని యుపాయములు దెలిపెద.

రాము—అట్లయిన విభీషణా!

తే. గీ. భండనంబున నింద్రజి * ద్భంగమునకు
నెట్టివాఁడుండవలయునో * యెఱుఁగరాదు
కుంభకర్ణుఁడేరీతిఁ దా * గూలునొక్కొ
తెలియకుండెను జెప్పుమా! * తెల్లముగను.

విభీ—స్వామి. యింద్రజిత్తును జయించువాఁడు పదునాలుగు వత్సరంబులు నిద్రాహారంబులులేక వ్రతనిష్ట నాచరించిన ఘనుఁడయి యుండవలెను.

రాము—అట్లనా? అక్కటా! ఇది మిక్కిలి గష్టపురంబనియెం. ఇట్లు మనలో గడపినవాఁడెవ్వఁడునులేఁడు. వీనినెట్లు జయింపఁగలము.

లక్ష్మ—అన్నయ్యా మీరు విచారింప నవసరములేదు. నేనట్లాచరించితినిగాన వానింగడ తేర్చెద.

రాము—తమ్ముడా! నాఁడు నీకొక కదళీఫలముసంగియుంటినే నీవద్దాని నారగింపలేదా.

లక్ష్మ — లేదు ఇదిగో చూడుడు

(అని తొడనుజీల్చి పండునుజూపును.)

రామ — (సంతోషముతో) సరే యింద్రజిత్తును నిర్జింపవచ్చును. కుంభకర్ణుఁడెట్లీలును?

విభీ — వీనుఁడు తొల్లినాఁడు నిద్రాయత్త్వంబునకుఁ దపంబొనరింప దేవతలు పగలబొగులుచు బెగడింది గడించిభక్తిని భారతి నారాధింప నామెకృపాశుత్త్వంబున వరక్షణంబున వాని జిహ్వాగ్రంబున నిలిచి దుండగీనిచే నిద్రయకుమారు నిద్దురయని పల్కించినది. అందుచే వానికి నిద్దురయేవరముగా నీయఁబడినది. పిమ్మట వాఁడు తెలివిదెచ్చుకొని మరల బ్రహ్మను మెప్పించి వత్సరములో సగముకాలము నిద్దురగానుండునట్లును తక్కిన సగమును మెలకువగానుండునట్లును నీసగంబును దన్నెదిరించువారు గతాసురులగునట్లును వరములఁ బడసెను. ఈసమయము నిద్రాసమయముగాన ననాయాసముగా నిర్జింపవచ్చును.

రామ — మిత్రమా! ఇఁక రావణుఁడెట్లీలునో దయచేసి చెప్పుము.

విభీ — స్వామి! ఈతఁడు దపంబొనరించినప్పుడు సకల జీవులవల్లనుఁ జావులేకుండు వరముఁ గొనెనుగాని నరవానరులవల్లమాత్రము గైకొనలేదు. అందుచే వానిననాయాసంబుగా బ్రధనంబున నిధనంబు నొందింపవచ్చును.

రామ — శహబాస్ విభీషణా! నీవొక్కఁడవుగదా నామనంబునకు వచ్చిన మిత్రుఁడవు. ఇప్పుడు నాకొక యుపాయంబు దోఁచుచున్నది. సామదానభేదంబులను చతుర్విధోపాయంబులలో మొదటిది సామము గనుక యిప్పుడు రావణునికడ కేరనయినఁ బంపుటుచితము. ఏరినిబంపిన సంధి నిర్విఘ్నముగా నెరవేరునో తెలియకున్నది.

హను — స్వామి మన యంగదకుమారుని కన్న వాక్చాతురీ దురంధరులేరుమఁ గాన రాదు ఆతనింబంపినఁ గార్యంబు తప్పక సిద్ధించును.

రామ — అట్లయిన వానినిట కొక్కసారి తీసికొనిరమ్ము.

హను — చిత్తము (నిష్క్రమించి అంగదునితోఁ బ్రవేశించును.)

అంగ — జయము జయము రాఘవేంద్రా! నన్నుఁ బిలిపించిన కారణమేమియో యానతీయఁ గోరుచున్నాఁడ.

రామ — ఓయి

సీ. అసురేంద్రి పత్నినైన * దశకంఠుఁగనినీవు
ఘనరామజనవర్యుఁ * డనఁగులుంఁపు
పెనుసేన తనయాన * ననయంబు నెఱపంగ
బంధించి లంఘించి * వార్ధిఁదాను
చనుదెంచె నినుఁగూల్ప * ననువుగాజానకీ
వనజాక్షి నొసఁగని * పక్షమందు
నడగించి జడిపించి * గమమించి నినుఁద్రుంచి
గొనిపోవు నీపల్కు * మనసులోన
తే. గీ. నెంచిజింతించి విరమించి * జెంచలాక్షి
నొసఁగి వసుధపయిఁబశువ! * మసలుమనుచు
విశదపఱిచియు నొసఁ * గెడి గసరుపల్కు
నెఱిఁగి పసఁజూపి * గసితోడ దిరిగిరమ్ము.

అంగ—మహాప్రసాదము.

(అనినిష్క్రమించును)

రామ—మనము(గూడబోయి లంకాపురని ముట్టడింతము రండు.

(అనినిష్క్రమింతురు.)

---

తృతీయరంగము.

---

రావణునికోటలో పాతాళహోమశాల.

[ప్రవేశము—రావణుఁడు, యింద్రజిత్తు.]

రావ—కుమారా! యీహోమమువలన,

ఉ. వైరులనెల్ల యుద్ధమున * నంతమొనర్పఁగవచ్చు శక్తిచే
మారణజేసి దేవతల * మాడ్చఁగవచ్చు మహీంజనంబులన్

గారియజెట్టవచ్చు పరకాంతల * జేర్పఁగవచ్చు దీననే
దానిని గాంచినఁగా మనకు * దప్పకగల్గు శుభంబులెన్నియో.

యివి నిర్విఘ్నముగ కొనసాగిన మనకీరాముఁడొక లెక్కా?

యింద్ర—తండ్రీ సత్యమేగాని అకపివీరులెట్లుతండోపతండములుగా వచ్చుచుండిరో గాంచుఁడు.

రావ—వారు మనజన్నమును పాడొనర్చుటకే యేతెంచుచుండిరని తోచుచున్నది.

(నేపథ్యమున)

ఓహో హనుమద్నీల నుసేషణాంగద జాంబవంతాది మత్కపివాహినీ ముఖ్య సేనానాయకులారా! యిట్లూరక మాచుచుండిన కార్యములేదుమీరొక్కొండు వీనిహోమంబును పాడొనర్పుఁడు.

యింద్ర—తండ్రి వింటిరా సుగ్రీవుఁడిచ్చిన యనుజ్ఞ. అల్లదె యాకపులెట్లు రాలఁ గుప్పుచుండిరో గాంచుఁడు. నేబోయి వారిని వారించెదగాక. (అనినిష్క్రమించును)

(అప్పుడు నేపథ్యమున కలకలము. హోమముజల్లారుచుండ రావణుఁడాహుతిజేయుచునుండును.)

(నేపథ్యమున)

అంగదా యిట్లొనర్చిన నీరావణుఁడు చలించునట్లులేదు. యింద్రజిత్తటకు రాకముందు నీవుపోయి అంతఃపురనివాసినియగు మండోదరినిటకీడ్చుకొని రమ్ము. దాన వీనిని రోషముగల్గి దీనిని మానును.

చిత్తము.

రావ—(తనలో) కారణమేమొకో నాయెడమకన్నదరుచున్నది. హోమము నిర్విఘ్నముగ నెరవేరునో నెరవేరదోగదా. (అని యాలోచించును.)

(నేపథ్యమున)

హానాథా! యీవానరుఁడు నాకేశములొడిసిపట్టి నన్నీకరకురాలపయి నెట్టీడ్చుచున్నాఁడో చూడుము. రక్షింపుము దిక్కుమాలినదాననయితి రక్షింపుము.

రావ—(తనలో) ఎవ్వరిదీధ్వని పోల్చిచూడ మత్ప్రియసి కంఠధ్వనివలె తోచుచున్నది. అక్కటా! యిప్పుడేమిజేతును. నేనామెను రక్షించుటకేగిన,

తే. గీ. శత్రురాజుల గెలిచుచు * సద్వ్రతంబు
విఘ్నమైపోవుఁ బోవున్న * వెలఁదిమాన
భంగమగుఁ గాన నెదిజేయఁ * బాలుపడదు
ప్రాణసంకటమైపోయె * భవుఁడనాథ.

ఏమయినను మానసంరక్షణార్థ మీహోమమును మానుటయె కర్తవ్యము. (ప్రకాశముగా) ఓరోరి వానరకులకలంకులారా! ఓరీ అంగదా ఏమిరా మీకంతకావరము. సఖీ! నేనిదె వచ్చుచుంటిని భయపడకుము. (అని నిష్క్రమించును.)

(ప్రవేశము హనుమంతుఁడు అంగదుఁడు)

హను—యువరాజా! ఎట్లనో వీని హోమమును బాడొనర్చితిమిగదా. ఇఁక నిర్భయముగాఁ జరింపవచ్చును. ఈసంగతి శ్రీరాముఁతోఁ జెప్పవలయురండు.

అంగ—మంచిది. (అంతట వారు నిష్క్రమింతురు.)

(ప్రవేశము రావణుఁడు మండోదరి.)

రావ—చెలీ! దురాత్ముఁ డంగదుండు నీకేశాకర్షణం బొనరించినప్పుడు నీ వెంత చింతనొందితివోగదా.

మం—నాథా! మీరు రామునితోఁ గయ్యముమానుట కియ్యకొంటిరేని నాకే విధమైన బాధయుఁ గలుగనేరదు.

రావ—నారీమణీ! రాక్షసాన్వయమునబుట్టి విపరీతపుబల్కుబల్కుదేల? ఎన్నఁడును దేవతలకే జడిసి యెఱుఁగనివాఁడను నేడొకపాదునరునిఁజూచి గడగడలాడువానికి శరణుజొత్తునే?

మం—నాథా! శ్రీరాముఁడు మానవుండనుకొంటిరా? ఆయఁడు సాక్షాద్విష్ణ్వవతారుఁడుగాని సామాన్యుఁడుగాఁడు.

రావ—(కోపముతో) మంధమతీ! దేవదేవుండయిన నీయిక్కట్లేల జెందవలె?

మం—ఇదంతయు నాయన చిద్విలాసముగాని వేఱొండుగాదు.

రావ—భగవంతుని కొకరిసాయమేల?

మండో—దీనినొక మాయనాటకములాగున జరుపుచున్నాఁడు.

రావ — అట్లయిన నీనాటకపర్యవసానము నీక్షించి రామప్రాణములకు భరత వాక్యము జెప్పనిదే యీరావణుఁ డూరకుండువాడుగాడు.

మం — ఇట్లనేకులు చెప్పఁదలఁచియు జెప్పలేక తుదకుదామే జెప్పుకొనిరి గాన నాపలుకు లాలింపుఁడు.

రావ — ఇన్నిమాటలేల? నానిశ్చయము వినుము.

తే. గీ. ఇనకులోద్భవుఁ గెల్చిన * నింతితోడ
సుఖముజెందెద నోడిన * శోభతోడ
వీరస్వర్లోక సౌఖ్యముల్ * జూరగొందు
జంద్రమండల సంకాశ * చారువదన.

ఇది ముమ్మాటికిని సత్యము ఇఁక నీవంతిపురికేగుము. ఇది యటుండ.

తే. గీ. రామచంద్రునితోనేన * రణములోన
జచ్చిపోయియు మననేన * హెచ్చనేని
తిరుగజూతును నినునేను * ధీశుభాంగి
లేకయుండినఁ గడచూపు లేమయిదియె.

నేను చిన్నటనుండియు నీయెడఁజేసిన యెగ్గలను క్షమించి లగ్గలకానందించి దయయుంచుము. పొమ్ము.

మం — (తనలో) ప్రాణేశ్వరుఁ డెన్నిజెప్పినను వినకున్నాఁడు. పురాకృత మెట్లున్న నట్లగును. మదిష్టదైవంబులను నాప్రియునకు విజయమగునట్లొకమారు ప్రార్థించి మఱిపోయెదగాక. (అని నిష్క్రమించును.)

రావ — (తనలో) కాంతలకు జనుపీయరాదు. ఇచ్చిన దమకక్కరలేనిదాని యందుఁగూడ బ్రవేశించి తమభర్తలమనంబులఁ గలఁతురు. జన్యంబున సైన్యంబులెట్లుం డెనో తెలియరాదు. వేగ మరిగెదగాక. (అని నిష్క్రమించును)

ఇది తృతీయాంకము.

# ప్రచండరాఘవము.

## చతుర్థాంకము.

### లంకాపురిబయలు.

(ప్రవేశము కుంభుఁడు)

కుంభ—(తనలో) కటకటా! ఈదానవుల సంపదలు నీటిబుడుగలవలె చికిలింతై శ్వర్యములుగదా. ఎవ్వఁడో యొకదైత్యుఁడు బాహుబలమున విజృంభింప వానిమూలమున మేమందరమును చోలకరికప్పలవలె సుఖించుచుందుము. ఈరావణు నాశ్రయించిన యసురుల యుసురు లిప్పుడేమౌనో తెలియకున్నది. అదిగో నామిత్రుఁడే తెంచుచున్నాఁడు. వానితో నాలోచించెదగాక.

(ప్రవేశము నికుంభుఁడు)

నికుం—(తనలో) భళిభళీ యీరావణేంద్రుఁడు చిరంజీవియైయుండుగాత. ఈతని రాజ్యమాచంద్రతారార్కముగా వర్ధిల్లుఁగాత. ఈతనియెండనుండబట్టియేకదా దేవతలకు సైతము పక్కలో బల్లెములయితిమి. నేనీసడుమ నూరలేను. రావణుఁడెవ్వరితోడనో యుద్ధమొనరించుచుండెనఁట. ఆవిశేషంబు లేరయినఁ దెల్పిన వినుటకు కుతూహలమగుచున్నది. అదిగో నామిత్రుఁడటనున్నాఁడు వాని నడిగెదఁగాక. (పరిక్రమించి ప్రకాశముగా కుంభునితో) తమ్ముఁడా! విశేషములేవియు లేవుగదా.

కుంభ—లేకేమి గంపెడున్నవి.

కుంభ—కొన్నింటిని జెప్పుము.

కుంభ—గ్రామములోజరిగినవిశేషములు నన్నడుగుటకు నీవేదేశమరిగితివి? నన్నడుగనేల?

నికుం—కొంతాలమ్మపండుగకు నా పెండ్లామమ్మగారి పుట్టినింటికేగితిని. రెండయిదులు పదిరోజు లచ్చటనుండి తొమ్మిదవనాటి మధ్యాహ్నమునకిట కేతెంచితిని.

కుంభ—ఓరీనీపెండ్లాము నీకమ్మయగునా?

నికుం — అదేమిమాట కాకేమి? స్త్రీలపుమారులు స్త్రీలకుమారులు నేకరీతి నుందు రని పెద్దలు జెప్పుదురు. అట్టియెడ నాకుమారులు నాభాగ్యనమ్మయని పిలువ నేనుమాత్ర మెందుకుపిల్వకూడదు.

కుంభ — సరే నీయూహబాగుగనే యున్నది. ఇక్కడి సంగతులాకర్ణింపుము. కుంభకర్ణుఁడు రామునితో డీకొను టెఱుంగుదువు గదా!

నికుం — ఆ యెఱుంగుదును.

కుంభ — అత్తెరంగున వారు కొంతసేపు పోరిపోరి కోదండంబుల శాతశరసంఘాతసంధాన విమోక్షణంబు లితరులెఱుంగనట్లంపవానలఁ గురిపించుచు గరుడముతో నరదంబులనుండి లఘించి వివిధచిత్రవిచిత్రప్రచారంబుల గదాదండంబులఁ ద్రిప్పుచు నొకరిపయి నొకరతిలాఘవంబున బ్రయోగించుకొనుచుండ దురాత్ముఁడానరుఁడీయసురుని యసువు లపహరించెను.

నికుం — (భయముతో) హా కుంభకర్ణ. హా సత్వసంపన్న. నీ సేవకులమగుమమ్ము బాయనీ కెట్లు సాహసించితివి. ఓరీ. పినతండ్రియవస్థనుగాంచి మేఘనాదుఁడూర కుండెనా?

కుంభ — ఊరకొనుటేల? అట్లాతఁడీల్గినతోడనే మహాక్రోధంబున నీసుకుమార కుమారుండు క్రూరనారాచపరంపరల నారాముని తేరఁగప్పెనుగాని మధ్య సౌమిత్రి యడ్డుపడెను. తోడనే వానిని విడిచి బాలుఁడూర్మిళాకాంతునొక్క భల్లంబున నన్నగారి యుల్లంబు తల్లడిల్లగొట్టుటయు మొదలునరికిన తాళవృక్షంబు లీలశతాంగముపయిఁ బడి సమ్మూర్ఛితుండయ్యె. పిమ్మట రాముఁడాతనిని శిబిరంబునకుఁ గొంపోయి జాంబవంతుని యుపదేశంబున వాయుసుతునిచే సంజీవిఁ దెప్పించి వానికిఁ బోయుటయు బురదలోనుండి యీవలఁబడ్డమహిషంబువోలె దెప్పిరిల్లెను. మఱునాఁటి యుద్ధంబున మందభాగ్యుండగు మేఘనాథుండు సుమిత్రాసుతునిచే బంచత్వంబొందెను.

నికుం — (విషాదముతో) హా మేఘనాధా! హా దైత్యకులశీతకరా! హా విపక్షపరికర మదద్విపకంఠీరవా! పూర్ణచంద్రునిపోలెడి నీమోమును నీవుమాత్రగన్నవెట్టి దశకంఠుఁడు గాంచి యెంతచింతనొందెనో గదా! మిత్రమా యిప్పుడు మహారాజేమి యొనర్పనుంకించు చున్నాఁడు.

కుంభ—ఏమున్నది కుమారవియోగానల దందహ్యమానసుఁడయి తుట్టతుదకు దైత్యుఁడెచ్చునని నిన్నటినుండియు రామునితోఁ బోరుచున్నాఁడు కాని యోడిపోవునట్లు గాన్పించుచున్నది.

కుంభ—అట్లయిన నిఁక మనదారి మనము చూచుకొనవలసినదే

(నేపథ్యమున)

మ. మొదటన్ మూర్ఛిలి తెల్విఁ దెచ్చుకొని తా * మున్ ఘోరశస్త్రాళిచే
గదనోర్విన్ బడఁగొట్టువానరులఁ గం * గారొందఁగాఁ జేసి తా
నిదె యీమారును దేర్పై నొరిగె మా * యింపంగ రాముం డహ న
ల్లదె దైత్యాళినిఁ జేరు రావణుగతిన్ * మీరు కన్గొంటిరే.

కుంభ నికుం—హాచచ్చితి చచ్చితి.

కుంభ—అయ్యో దైత్యులను చంపుచున్నాఁడురా! తమ్ముఁడా!

నికుం—అక్కడనుండిన మనలఁగూడ చంపునుగాన పోదమురమ్ము.

కుంభ—కాలికి బుద్ధి చెప్పరా అన్నయా?

(అనినిష్క్రమింతురు)

(ఇది విష్కంభము)

ప్రథమరంగము యుద్ధభూమి.

[ప్రవేశము రాముఁడు విభీషణుఁడు హనుమంతుఁడు]

రాము—విభీషణా నీదయవలన.

తే. గీ. కుంభకర్ణుండు నాచేతఁ * గూలినాఁడు
మేఘనాథుండు తమ్ముచే * మిత్తి కమ్యె
రావణుండును బహు జన్య * రంగమందు
జానకీసతిఁ గొనిపోవ * నౌను సఖుఁడ.

ఎట్లయినను సిద్ధసంకల్పుఁడవు. నిన్నుఁబోలినవాఁడీముజ్జగంబులను గానరాఁడు.

విభీ—స్వామి! యిది కేవలమతిశయోక్తి సుండీ! ఇది యటుండ

ఆ. వె. సోదరుండుమజావ * శోకమొందుచునుండ
సుతుఁడుగూడఁ జచ్చె * చూడధరను
గోరుచుట్టుపయిని * గుమురుగా రోఁకటి
పోటు రీతినగు ని * శాటపతికి.

హను—ఇదంతయు నాతని స్వయంకృతాపరాధమే గాని మఱొండుగాదు. మొదట జానకీదేవి నెత్తుకొనిరాకున్న నీవు చెప్పినపల్కులం ద్రోయకున్న మండోదరి సదుపదేశమాకర్ణించిన నీపాట్లేల గల్గును.

ఆ. వె. కోరి తెచ్చినాఁడు * కుటిలుఁడై యుద్ధంబు
దశముఖుండు తాను * ధనముఁబెట్టి
యాబ్దికంబుగొన్న * యట్టులు గాకున్న
నింతవంత జెంద * నేల చెపుము.

విభీ—సత్యమే. దీనికంతకునుఁ గారణంబు బలోన్మత్తతయే. సర్వమెఱింగిన మూర్ఖుఁడయి దుర్మార్గంబునఁ బోవుచున్నాఁడు.

రాము—దైత్యాధిపా నీవిఁకఁబోయి సుగ్రీవాది మర్కటబలంబులతోఁ గలసి రాక్షససైన్యంబుల దైన్యంబు నొందింపుఁడు. కరుతలి సుతుఁడుమాత్రము నాతో నుండుగాక.

విభీ—మహాప్రసాదము. (నిష్క్రమించును)

(నేపథ్యమున)

ఓరోరి. మానవకులకలంకా! క్షుద్రపశువా! ఎందుబోయెదవురా. యెందుబోయెదవురా.

మ. పటుకోదండ విముక్తశాతశర * సంపర్కంబునన్ మూర్ఛచే
నటుసంగ్రామతలంబునందు * బరనాయంతంబుఁ గన్గొంటునం
చిటుమోహంబును జెందనేల తులువా! * యేనాకఁజాలేదు నిన్
ద్రుటిలోఁ గెల్చెద మత్ప్రతాపసరణిన్ దోస్సారమున్ జూపుమీ!

రాము—రోషభీషణంబులగు యీబాణంబు లెవ్వరివోగదా.

హను—స్వామి! యిదారావణుని కంఠధ్వనియే. శాతశరవేదనా పరిభూతకోర్ధాటి లేకుండయి యిదిగో మనమున్నదెసకే వచ్చుచున్నాఁడు.

రాము—రానిమ్ము. వానికిఁ గాలమాసన్నమయినదిలే.

(అంతటఁ బూర్వోక్తపద్యమును జదువుచు రావణుఁడు ప్రవేశించును.)

రాము—(రావణునకభిముఖుండయి) ఓరి మూఢుఁడా! ఆఁడుదాని యిష్టప్రకారము నడచు పెద్దయాఁడుదానవగు నీవు నన్నాఁడుదియని జెప్పిన నేరునమ్మదురు. ఇది యటుండ "స్త్రీబుద్ధిఃప్రళయాంతకా" యను నార్యవచనంబు చొప్పున

సీ. అలశూర్పణకేమాట * లాలించిపాలించి
పుడమిసూతునుగొని * పోవసీదు
పట్టణంబు మహాదగ్ని * పాలయ్యెఁగోటలు
భస్మంబులై పోయె * భండనమున
దమ్ముఁడామన్నయ్యెఁ * దనయుఁడామహీపాల
బడిపోయె బలములు * మడియనయ్యె
నొకతమ్ముతోవైర * మొనరంగజేసితి
వకలంకమతిపైన * నలిగినావు

తే. గీ. యిన్నియైననుజాలక * యిపుడునీవు
యుద్ధమందునఁ జావంగ * సిద్ధపడితి
వకట నిన్నుఁజూడనాకు జా * లయ్యెగాన
మహిసుజాతను నర్పించి * మనుముధరను.

ఇట్లొనరింపవేని యీరాముఁ డన్యథా యొనర్చునని యెంచఁబోకుము.

రావ—(గర్వముతో) మూర్ఖా! నన్నుఁగాంచ నీకు జాలిగలుగుచున్నదా? పాపమెంతకరుణార్ద్రచిత్తుఁడవు.

ఆ. వె. పవనరక్షణార్థమవలీలఁ దాటకా
సతిని జంపివిడువ జాలియగునె?
నాతికర్ణయుగము నాసికాంగంబు సో
దరునిఁ ద్రుంచుమనుట కరుణయగునె?

నీపౌరుష మాఁడువారిని శిక్షించుటయందే వినియోగపడినది.

రాము — ఈతప్పులు నాయందేకావు నీయందునుఁ గలవు వినుము.

తే. గీ. అనపరాధిని జానకి నధికశ్రమల
పాలజేసితివీనాఁడు పాపివగుచు
నల్లనలకూబరునిఁగూడ నరుగుదానిఁ
నష్టపెట్టితివానాఁడు ఖలుఁడవగుచు.

ఇట్టినీవొక మహావీరునివలె నోటికివచ్చినట్లు వదరిన బెదరువారెవరు?

రావ — ఓరీ నన్నుమించినవాఁడీ వసుధమీఁదఁగాదుగదా యీముజ్జగంబులను లేఁడు.

తె. గీ. ఎవఁడు బలమునఁగైలాసమెత్తెమహిని
యెవఁడు శక్రాదివేల్పుల నింటివద్ద
గాపుపెట్టెను ధలశుకనంబులట్లు
వెవఁడునాసాటిఁబొందునో యెఱుఁగజెపుమా?

రాము — ఓరి నిశాటకులపాంసనా! జనకపుత్రినొసంగకుండిన ధాత్రిపయిఁబడి ప్రాణంబులు గోల్పోవుసమయమున నీకు నీత యుండును నీసోదరుండునుసాటి. నీలోన నీవు "నేను శౌర్యరాసి" నని యెంతమురిసినను నీకుమాత్రము నాచేతిచావు దప్పదు. నీలకంథరచతురానన సహస్రనయన గజానన హయగ్రీవులు త్రయస్త్రింశత్కోటి నిర్జరానీకంబుతో వచ్చి కాచినఁ గాతురుగాక. కోదండముక్త చండకాండంబుల గాత్రంబుఁ జెండి భండనభూమికి నిన్ను బలిపెట్టకమానను.

రావ—(రోషముతో) లోకత్రిమైక భీకరుండగు రావణుని జంపుట భుజిం చుటగాదు. ఇటుచూడుము.

సీ. వడినెత్తి విరువంగ భవువిల్లుగాదిది
రావణేంద్రుని భీమరణముగాని
పదతాడనంబునఁ బడఁతిఁ జేయుటగాదు
ఖడ్గసాధనకళాగరిమగాని
ఒకబాణమునఁ గూలుటకుఁ గోతియునుగాదు
శౌర్యలాంఛిత దైత్యచయముగాని
కడునీచులను జంపి ఘనతనొందుటగాదు
ననునోర్చియున్న ఘనంబుగాని.
తే. గీ. ఆడు దానిని గడువేగ నడవిపాల
సేయుటయుఁగాదు చటులోగ్రమాయరణము
నందు బలపరాక్రమ శౌర్యమంది నిలిచి
పరగ గెల్చుటో! చచ్చుటో! పనిరరామ!

రామ—ఓరి పరాక్రమల దుర్విదగ్ధ! ఆత్మస్తుతి యర్హమగునా? ఔను యందు సీతక్షేమున్నది. నీసహజ గుణమును పోనిచ్చుకుంటివి గావు " పుట్టికిఁ బుట్టిన గుణము పుడకలతోఁ బోవు " ననుటబద్ధమా?

శా. నీరీతి! వచియించినట్టి యలదుర్నీతి ప్రభాపూర్ణులౌ
మారీచుండు విరాధుఁడన ఖరుఁడు దుర్మార్గుండు నీతమ్ముఁడుౘ
ఘోరాస్త్రానలమందు మ్రిగ్గి యసువుల్ గోల్పోయియుండంగ నీ
వీరాలాపము లాలకించి మొదలో భీతిల్లుదంచెంచినే.

రావ—(ఎకసక్కెముగా) ఈపౌరుషము పరశురామకోపవహ్నికి జడిసి శుద్ధాంతంబున కాంతవోలె గాజులు తొడిగించుకొని కూర్చున్నది. దశరథుని కొడుకగు రఘురాముని దే-గాఁబోలు. ఆహాహా ప్రతాపాహముగట్టి పారుచున్నది.

రాము—ఓ పసరమా! ఇది వినుము.

మ. మునులన్ నిర్జరసార్వభౌము ధరణీమూర్ధన్యులన్ నీవు గె
ల్చిన యట్లీరఘురాముఁ గెల్వఁ దరమే? చెండాడు నుద్దండ భం
డనరంగంబున నిన్ను వీరులగు దుష్టశ్రేణిమర్దింపఁ గం
కణబద్ధుండగు విష్ణుదేవుఁడని మూర్ఖా! యెంచు డెందంబునన్.

కావున నీక నయిన బుద్ధినహించి సీతనొసంగి పదికాలములపాటు బ్రతుకుము.

రావ—ఓహో యీయన విష్ణుమూర్తిగారట దుష్టులను నన్నును జంపునట అబలాహంతకుఁడాది విష్ణువెట్లౌనో.

హను—స్వామి! యెంతసేపీతఁడిట్లొడలు మరచి ప్రేలుట.

రాము—ఓయి

తే. గీ. చటులగాఢాంధకార సంఛన్నమయిన
యామినీమహాసమయ మీయవనిలోనఁ
జంద్రభాస్కరభూరి తేజంబువలనఁ
గాకపోవునేయని లసంఘాతకలన.

వాని కాలమాసన్నమయినది.

రావ—(కోపముతో) రామా! యేమంటివి? నా కాలమాసన్నమయినదనియా.

తే. గీ. ఇనకులకలంకలంకయా నిద్దిచూడ
కానియలయయోధ్యాపురి గాదుసుమ్ము
తల్లి కౌసల్యగాదిది తండ్రిగాఁడు
చటులసంగ్రామమిది యాటసాగదిచట.

నీకుఁ గొన్నింటిలోమాత్రము ప్రజ్ఞకలదు.

తే. గీ. వనములందునఁ దమ్ముతో బయలుదేరి
దుంపకూరలుదిని స్త్రీలఁదమింపఁగలవు
కోతికైసాలభూజముల్ గూల్చఁగలవు
దవనిజాతతో సరసంబు లాడఁగలవు.

ఇంతకన్న నీ కేమియుఁ జేతకాదు. ఇంకను సిగ్గుపడక వీరునివలెఁ గారులఱచుచు డంబములు గొట్టెదవేమి?

రాము— ఛీ రాక్షసాధమా! నీ దుర్వినయంబునకును దుష్పాండిత్యమునకును మహదానందమయినది. నే నొకటడిగెదఁ బ్రత్యుత్తరమిమ్ము.

మ. వనితారత్నము మైథిలీసతిని భావంబందు నీ మాతగాఁ
గనినాకర్ణణ సేతువో, విపులసంగ్రామంబులో శత్రుమ
ర్దనదుర్దాంతకరాంత భీకర పటుదోర్విస్ఫురత్కాండ ఖే ప్రహా
తనుఘీస్తంబగుహస్తమందు బడెదో! దైత్యాధమా! చెప్పుమా.

రావ— చెప్పుటిదివరకే యయినది. ఇంకొక్కమారుగూడ వినుము.

తె. గీ. బక్కదనుజులఁ గూల్చినబంటనీవు
ప్రబలశత్రులరాల్చిన బంటనేను
హస్తిమశకాంతరంబున్న దరసిచూడ
నాకునీకునువార సీతాకళత్ర!

అందుచేత

తె. గీ. రెండుచేతులుజోడించి దండమిడియు
సీతకై నీటిబొట్టును జేతులార
విడిచి సౌమిత్రియును నీవుఁ దడయకిపుడు
మీపురంబున కేగుఁడు పాపులార!

అట్లొనరింపవేని మాతంగతురంగసద్భట శతాంగ సమన్విత జంగాభీల సంగరరంగంబున మిమ్ము భగంబునొందించి కురంగాక్షితో ననంగసుఖంబులు నిరాటంకముగా ననుభవింతును. ఈపలుకులు త్రికరణశుద్ధిగాఁ జెప్పితిని. నమ్ముము.

రాము—(మహాకోపముతో) దురాత్మా! కారులరచుచుంటివా యిదె కొనుకొమ్ము నావిశికంబులు నీశరీరంబు తుత్తునియలు గావించును.

రావ— ఈకన్నులకీ అప్పలు దూరములుగావు. నీపరాక్రమమును నాశౌర్యమును మనచుట్టునున్నవారందరును జూతురు.

(నేపద్యమున)

ఓహో రావణా! లోకవిద్రావణా! యీయంగదుఁడు మమ్ముల బ్రతుకనిచ్చుట లేదు. వాలంబునఁజుట్టి శిరంబులు చట్రితులమీఁదఁ బెట్టి పగులఁగొట్టి రాక్షససమూహకనందఱ జింపరవంపర జేయుచున్నాఁడు. రక్షింపుము రక్షింపుము.

రావ—ఓదనుజులార! నేనిదె వచ్చుచుంటి భయంపడకుఁడు భయంపడకుఁడు.

(నిష్క్రమించుచున్నాఁడు.)

హను—వీఁడీవంకతోఁ బారిపోవుచున్నాఁడు.

రాము—వానికిఁ బారిపోవ లెననియున్న మనము పోనిత్తుమా. పోయి వానినంత మొనర్తము. రమ్ము. (నిష్క్రమింతురు.)

(ప్రవేశము—కుంభుఁడు.)

కుంభు—(తనలో) హా! రావణా! హా! లోకవిద్రావణా! హా! దనుజకులమందార! హా! నిజకరవాలవిక్షేపమాత్రదూరీకృత శాత్రవానీక! హా! యామినీచరరాజన్యగళాపతక నాయకమణీ సంకాశ! నీపాలనంబున సమస్త భోగంబులనుభవించిన మాదైత్యులనోట దుమ్ముఁగొట్టి స్వర్గసౌఖ్యంబుల నర్గళలీలననుభవింపఁబోతివా? మహామ్మారియగు సీతపయి నీచిత్తంబేలహత్తించె. తుచ్ఛుండగు నరునిచేతనా నీవుచావవలసివచ్చె. విధివిధానంబవిలంఘనీయముగదా. (తెరలో కలకలము) అదిగో! విభీషణుని బరామృశించుటకేగు తలంపున రామచంద్రుఁ డీదారినే వచ్చుచున్నాఁడు. కంటికగుపించిన నన్నుఁ స్తూడ మింటికంపునేమో కాలికిబుద్ధిచెప్పెదఁగాక. (నిష్క్రమించును.)



# ప్రచండరాఘవము.

## పంచమాంకము.

ప్రథమరంగము — రావణునినగరు

[ప్రవేశము రామలక్ష్మణహనుమంతవిభీషణులు]

రామ — విభీషణా

తే. గీ. ప్రాణతుల్యుండయిన * త్వదగ్రజునినేను
నంత మొనరించినాఁడ * నంచలుగఁబోకు
నాకుభక్తుండవు నీవు * నన్నయయుఁగాన
పంచుకొంటిని నీ * దుఃఖభారమ్మేను.

కాన నిఁకమరచిపొమ్ము.

విభీ — (శోకముతో) స్వామి.

చ. మఱచుదపోవని యమానుషచర్య * లొనర్చియుండె భీ
కరపరశత్రునాగములకంటికి * సింహసమానుఁడయ్యె సం
గరబడబానలుండు గద కన్న * కుమారునికన్న మిక్కుటా
దరమున నన్నుఁగాంచునుగదా * మఱిపెట్టులు గల్గునెమ్మదిన్.

(అన్ననుదలంచి శోకముతో) సోదరా!

ఉ. రామునితోడ వైరము కరంబపకారము గల్గజేయు న
న్నా! మహావిష్ణువిట్లు జననంబును బొందెను దుష్టశిక్షకై
భూమను వానికీయు" మనిప్రార్థనజేసినఁ ద్రోసిపుచ్చి సం
గ్రామముఁజేసి ప్రాణములు రామునికిచ్చియు మమ్ముబాసితే?

రామ — సద్గుణస్తోమా!

శా. సప్తాంభోనిధి ముద్రితాఖిలమహీచక్రాధి నాథావళీ
తప్తఃకాంచన పద్మరాగఘటికాధానళ్యా సన్మౌక్తికా
దీప్తప్రాభవ సత్కిరీటవిలసత్ప్రీ పాదకంజాతుఁడీ
తప్తంజేరియుఁ గొల్వనుండుతఱి నేధాత్రిఁగనంబోవఁగా!

(అని దుఃఖించును)

లక్ష్మ — ఓయి సకల విద్యాపారంగతుండవయిన నీవీలీల జేలవయి జాలిదూలనేల కాలమొకలాగె నుండునా? నీయన్న నిర్వక్రవిక్రమంబున నేకచ్ఛత్రంబుగ దీనినిబాలింప స్వర్లోకంబునకుఁ బోయినాఁడు. నీవు వానికయి చింతింపక యభిషిక్తుండవయి లంక నేలుకొమ్ము.

(అంతట విభీషణుని సింహాసనముపయి గూర్చుండబెట్టి కిరీటముఁ జేతబట్టి)

రాము — విభీషణా!

తే. గీ. ధర్మమార్గానుగామివై ధరణిలోని
పరకురంగాక్షులను మాతృభావమునను
గాంచి మహానుల భక్తి నర్చించుచుండి
లంకనేల్మా విష్ణుముద్రాంకితముగను.

(కిరీటంబును శిరంబుననుంచును.)

[ప్రవేశము మహేంద్రుఁడు అగ్ని. యముఁడు వరుణుఁడు]

ఇంద్ర — హా మహాత్మా మారజనకా లక్ష్మీకళత్రా

చ. ఇనకులసోమ! సోమదనుజేంద్ర యానక భీమభీమ భీ
షణరణశూర జనసంచయసుత్య గభీర ధీర పా
లనపరచిత్తజ విలాససన్నిభ రత్నరత్న ప
ద్గుణగణరాజ కులగోత్రపవిత్ర పవిత్రమిత్రమా!

(శరణు శరణు వైకుంఠవాస)

రాము — దిక్పతులారా! మీయొక్క పరిపంథి నామమాత్రావశిష్టుఁడయ్యెఁ గదా ఇఁక నభ్యుదయంబులకు లోటుండదు. చింతదక్కి సంతసంబు వహింపుఁడు. మేమయో

ధ్యకేగ పట్టాభిషిక్తులమయి కొంతకాల మద్దానిం బరిపాలించి పిమ్మట వైకుంఠంబున కే తెంతుము. మీరిక బొండు. రాక్షసేంద్రా నీయభీష్టంబులన్నియు సిద్ధించినవి గదా.

విభీ—శ్రీరామచంద్రా లక్ష్మణభరతశత్రుఘ్నులు ఛత్రచామరగదాదండమండి తహస్తులయి నిన్నుఁ బరివేష్టించియుండ భూమినితాజాతసరసంగూర్చుండియుండ సమీర నందనుండు పాదసేవజేయుచుండఁ బేరోలగంబుననున్న మీదివ్యసుందర విగ్రహంబును గాంచి మోదించి స్తుతించెడి భాగ్యంబు కెదురు చూచుచుంటిని.

రాము—అచిరకాలంబుననే చూడఁ గలవు. మనమింక బోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు.)

శ్రీరామపట్టాభిషేకము

కళ్యాణమంటపము

పరివేశము రామలక్ష్మణభరత శత్రుఘ్నులు జానకి విభీషణుఁడు హనుమంతుఁడు

సుగ్రీవుడు మొదలగువారు]

రాము—జానకీ! పతివ్రతవగు నిన్నలయించిన యీయవివేకి తప్పులను మ న్నింపుము.

జా—నాథా మీప్రసన్నత్వంబుచే నాయలుక నిశ్శేషమయినది.

రాము—నీకేమయిన కోరికలున్నఁ గోరవచ్చును.

జాన—నాయభీష్టంబులన్నియు నెరవేరినవిగాని లోకహితార్థ మిట్లగుఁగాక.

—భరతవాక్యము—

తే. గీ. ధర్మమే కర్మమైధాత్రిఁ దనరు గాక
రాజు జనసమ్మతుండౌచుఁ గ్రాలు గాక
పరకృశోదరులను మాతృభావమునను
గాంతురిగాక సద్భక్తి నర్చింతురిగాక.

అందఱు—తథాస్తు తథాస్తు.

నిష్క్రమింతురు (తెరవాలును)

ఇదిపంచమాంకము

సమాప్తము.

శ్రీరామచంద్రార్పణమస్తు.



# శ్రీగ్యారంటీబంగారు లక్ష్మీపిల్లకాసులు

ఈకాసులయెత్తు, బంగారువన్నె, సైజు, పనితరము, మామూలుఫ్రెంచి పిల్లకాసులకు మించియుండును. ఈయెత్తు, ఈవన్నె బంగారముగల ఫ్రెంచి కాసులు రు 4–4–0 కు అమ్ముచుండగా మాలక్ష్మీకాసులు రు 3–4–0 కే కాసుబంగారము చేసి అమ్ముచున్నాము. మీరు బంగారం తెచ్చియిచ్చేయెడల చార్జీపుచ్చుకొని స్వదేశీలక్ష్మీకాసులను యంత్రములసహాయమున చేసియిచ్చెదము. నాలుగుపెద్దకాసులు కరిగించి 20 లక్ష్మీకాసులు తయారుచేయుటకు 1కి 0–4–0 చొప్పున రు 5–0–0 లు. 20 లక్ష్మీకాసులుపైగా ఎన్నితయారుచేసినప్పటికి 1కి 0-3-0 చొప్పున తయారుచేయుదుము. మావద్దనున్న లక్ష్మీకాసులుసైజున మీరుబిళ్ళలుచేయించితెచ్చేయెడల 20 లక్ష్మీకాసులులోపు వాటికి 1కి 0-3-0 చొ॥నను, 20 లక్ష్మీకాసులుదాటినవానికి 1కి 0-2-0 చొ॥నను మజూరీతీసుకొని బిళ్ళలు కాసులుచేసియిచ్చెదము. బిళ్ళచేయుటకు సైజుకావలసినచో మావద్దనేచిక్కును.

వలయువారు

అయ్యగారి బాపిరాజుగారు, ప్రొప్రయిటరు.

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాల. ఇన్నీసుపేట, రాజమండ్రి.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 20 | నేర్పఁగను | నేర్వఁగను |
| 12 | 11 | చణ్డాంశు | చండాంశు |
| 26 | 18 | సంతతినిట | సంతతనిల |
| 36 | 11 | మ. | చ. |
| 43 | 2 | లవమున | లవమున్ |
| 48 | 2 | దానిని | దారిని |
| 50 | 6 | ఇనుకు | ఇనకు |
| 53 | 6 | తామున్ | రామున్ |
| 53 | 9 | గతిన్ మిా | గతిన్ హోమిా |
| 53 | 21 | మరిదు | మందు |
| 54 | 22 | సందుఁబర | సందుఁబడ |
| 54 | 23 | యేనాక | యేనింక |
| 55 | 9 | శూర్పణకే | శూర్పణఖ |
| 55 | 19 | నిన్నుఁజూ | నినుఁజూ |
| 56 | 10 | సష్ట | గష్ట |
| 56 | 15 | శతాద్రి | శశాద్రి |
| 56 | 17 | నెవఁపు | లెవఁపు |
| 56 | 17 | జెపుమా | జెపుమ |
| 57 | 18 | నీరీతి | నీరీతిన్ |
| 57 | 19 | విరాధుఁడన | విరాధుఁడున్ |
| 57 | 20 | యుండంగ | యుండంగనీ |
| 58 | 23 | గలవు | గలుగు |
| 59 | 7 | దా్రిహిష్ఠ | ధా్రిహిష్ఠ |

| | | | |
|---|---|---|---|
| 59 | 8 | పీస్త్రంబ | వస్త్రంబ |
| 59 | 10 | నీవు | వీవు |
| 61 | 8 | యయుఁగాన | యగుఁగాన |
| 61 | 18 | విశ్లు | విట్లు |
| 62 | 2 | నాధావళి | నాధావళీ |
| 62 | 3 | ఘటిత | ఘటికా |
| 62 | 3 | సన్మౌక్తికా | సన్మౌక్తికో |
| 62 | 5 | తప్తం | తప్తున్ |

**N B** 62 వ పుటయందుఁ గలయిుంప్రి పద్యంబునకుఁ బాఠాంతరము.

చ. ఇనకులసోమ, సోమ దనుజేంద్ర విజిత్వరభీమ, భీమ భీ
షణరణశూర, శూరవనజాత మహాగ్ని గభీర, భీరపా
లనవరచిత్త, చిత్తవిలాస సమన్విత రత్నరత్న స
ద్గుణగణ రాజరాజకుల గోత్రపవిత్రపవిత్ర మిత్రమా.

